# రథాంగదూతము.

(గద్యము.)

గ్రంథకర్త- శ్రీ రా[illegible]



కే. రామకృష్ణయ్య, యం. ఎ. యల్. టి., గారిచే

చెన్నపురి:
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ప్రెస్సున
ముద్రించి ప్రకటింపఁబడినది.
1930

వెల అణా 6.

# పీఠిక.

ఆంధ్రవాఙ్మయమునందలి గద్యశాఖ యిటీవలి కాలమున ననఁగా ..వ శతాబ్ది మధ్యభాగమునుండి బయలుదేరినదిగాఁ దలంపఁ దగియున్నది. ..ంతకుపూర్వము, అనఁగా 17-18 శతాబ్దులయందు దక్షిణదేశమునందలి ..ధుర తంజావూరుప్రాంతముల నాయకతొండమాన్ రాజుల కాలమున ..యలుదేరిన గద్యగ్రంథ సమితియంతయు సరస్వతీ భాండాగారమున ..స్తంబై మొన్న మొన్నటివఱకు నాంధ్రదేశమున నేమాత్రము ప్రచారము ..క యాంధ్రదేశీయులకుఁ దెలియని దగుటచే, 19-వ శతాబ్దిని నీదేశ..న బయలుదేరిన గద్యగ్రంథములకు నాదక్షిణదేశగద్య వాఙ్మయమునకు ..ట్టిసంబంధము లేకుండుటంబట్టి, యాంధ్రదేశమునందలి గద్యవాఙ్మయ..న కాదక్షిణదేశవాఙ్మయము మార్గదర్శకంబైనదనిగాని యేవిధమైన ..ోత్సాహము గలిగించినదనిగాని చెప్పుట కేమాత్రము వీలు కనఁ..డదు. కావున నాంధ్రదేశమందలి గద్యవాఙ్మయము దక్షిణదేశమందలి ..దానికంటె నూరు నూటయేఁబదిసంవత్సరముల తరువాత స్వతంత్రముగనే యేర్పడినదని చెప్పవలసియున్నది. ఏదేశమందుగాని పద్యవాఙ్మయము కంటె గద్యవాఙ్మయము చాల వెనుకబయలుదేరినట్లు తెలియవచ్చుచున్నది. ఛందోబద్ధములగు మంత్రములు ఏర్పడినతరువాతనే గద్యరూపములగు యజుస్సులు బ్రాహ్మణములు రచియింపఁబడినవి. గ్రీకురోము మొదలగు నితరదేశముల వాఙ్మయములందు నిట్టిక్రమమే గానవచ్చుచున్నది. జనులావేశరసపూరితులై యున్నప్పుడు వారిమనోవీథులఁ బ్రవహించెడి భావప్రవాహము బహిర్గతమై వాగ్రూపమును బొందుసందర్భమున నది ఛందోబద్ధంబై తాళలయగతంబై పద్యరూపమును బొందును. జనుల కవితావేశమే పద్య కవితావిర్భావమునకుఁ గారణము. తరువాత దేశమునగ్గి వ్యావహారికజ్ఞానము విమర్శనబుద్ధి జ్ఞానసంపాదనప్రతిపాదనా చింతయుఁ హెచ్చినకాలముననే గద్యవాఙ్మయము ప్రబలుట కవకాశము లేర్పడు

చున్నవి. జనులు శాంతచిత్తులై వస్తుపర్యాలోచనకుఁ గడంగిన కాలమున గద్యవాఙ్మయము బయలుదేరును.—

**"Poetry is purely emotional, and purely intellectual is prose. In the early life of any nation generally the emotional side predominates. As it gains in experiance, in civilization when science develops, when time for offering criticism arrives, then that is the time for prose, pros comes into existence on its own accord."**

ఈపై విషయమును ఆంధ్ర వాఙ్మయముపట్ల సంపూర్ణముగా సమ ర్థించుటకు వీలు కనఁబడదు గాని యది కొంతవఱకు కన్వయింపకపోదు. ఆంధ్రవాఙ్మయము సంస్కృతవాఙ్మయ సంసర్గము చేఁబుట్టి తద్రసముచే బుష్టిఁజెంది పెంపొంది కొంతకాలమునకు స్వాతంత్ర్యమును స్వాభావిక రా ణీయకతను బడసిన కృత్రిమో (artificial) ద్యానమువంటిది. సంస్కృ భాషాసంపర్గ ప్రభావముచేతనే యీవాఙ్మయమునందాది కవీంద్రులని ప్రసి జెందినవారు ఆదికావ్యముగా గ్రహింపఁబడిన యాంధ్రభారతమును చంపూ కావ్యముగా రచించుట తటస్థించినది. తిక్కన నిర్వచన గ్రంథము వ్రా నను తరువాతి యాంధ్ర కవులందఱును భారత ఫక్కిని చంపూమార్గము యాదరించి యవలంబించిరిగాని యిటీవలి కాలమువఱకు నిర్వచన కావ్య రచనకుఁగడంగలేదు. నన్నయకుఁ బూర్వమునఁగల దేశీయవాఙ్మయ మిం వఱకుద్ధరింపబడుటకుఁ దగిన యవకాశములు లేకపోవుటచే దానిస్వరూ మిదమిత్థమని నిర్ణయించుట కంతగా వీలులేక పోయినను, అప్పటినుం యీకాలమువఱకును బ్రాకృతజనుల వ్యవహారములోనుండి వారియాదర మునకు విశేషముగఁ బాత్రంబగుచున్న పదములు పాటలు మొదలగు ప్రాకృత గేయవాఙ్మయ స్వరూపమును బట్టి నన్నయకుఁ బూర్వమున గలిగి నట్టి ప్రప్రథమాంధ్రదేశీయ వాఙ్మయమనునది యొకవిధముగ ఛందో బద్ధంబై, అనుప్రాసోపశోభితంబై యతినియతంబై, తాళలయాన్వితంబైన

యు కవిత్వరూపముననుండెడిదని యూహించుట కవకాశము లేకపోదు. ఈదృశకవిత్వ విజృంభణము కేవల గీర్వాణ కవితా మర్యాదాభిమానులై తదనుసరణ కుతూహలాయత్తచిత్తులగు నాదికవుల కవితోద్యోగంబుచే నణఁగిపోయినను స్వాభావికంబైన యీప్రాకృత కవిత్వముయొక్క పొదలు మతావేశముచేఁ బైకుబికిపాల్కురికి సోమనాథుని కవితయందును గౌరనాథ శ్రీనాథాదుల వీరచరితములందును అప్పుడప్పుడు పొడసూపు చేయుచుండి, తుదకు 17-18 శతాబ్దులందు దక్షిణదేశమున గొంచెము తలయెత్తినవి. పరదేశ భాషామధ్యగతులైన యాంధ్రుల కీకాలముననే యాంధ్రగద్యరచనల యావశ్యకతయు గలుగుటచే నాంధ్రగద్య కావ్యములుగూడ నీదేశమున బయలుదేరుట తటస్థించినది.

కాని, ఆంధ్రదేశమునఁ బాశ్చాత్య దేశభాషావాఙ్మయములతోడి సంబంధము ప్రబలిన తరువాతఁగాని, అనఁగా 19-వ శతాబ్దము మధ్యభాగమువఱకు నాంధ్రకవులు గద్యకావ్యరచనకుఁ గడంగలేదు. కడచిన శతాబ్దములో మన యాంధ్రదేశమున నాంధ్రగీర్వాణముల నసమాన పాండిత్యముగలిగి యుభయభాషలయందును నిరర్గళముగ కవిత్వముం జెప్పి యనేక గ్రంథములు రచించుటేగాక యాంధ్రమునఁ గ్రొత్తమార్గములఁ ద్రొక్కినవారిలో "పరశురామవిజ"యాది గ్రంథరచయితయగు కోరాడ రామచంద్ర శాస్త్రిగా రగ్రగణ్యులని చెప్పుటకు సంశయములేదు. కాళిదాసుని మేఘసందేశకథను "ఘనవృత్త" మనుపేర పూరించుటేగాక, నీతని కుమార సంభవమునకు బదులుగా కుమారోదయమను నుద్గ్రంథమును వెలయించెను. ఇట్లు సంస్కృతమున నీయన రచించిన యిరువది ముప్పది గ్రంథములేగాక యాంధ్రగ్రంథములు నయితము దేశమున విశేషవ్యాప్తినందకున్నను, వీరి యాంధ్రగ్రంథములు ఆంధ్రవాఙ్మయమున నూతన శాఖలకు దారితీసిన యగ్రగణ్యులలో నీయన యొకఁడని చాటుచున్నవి. ఆంధ్రమున సంస్కృతనాటకములను ననువదించుటకును, కల్పిత కథతో నాటకము వ్రాయుటకును గడంగినవారిలో నీయన ప్రథముఁడు. ఆంధ్రకవులింకను

నాటకాదిరూపకరచనకుం దిగని కాలమున నీయన.—

"బహుళగుణంబుల ననేకలేఖినీ విలేఖిత హృద్యపద్యావళి సంతోషిత పరజన స్వాంతుండగు నతం డొక్కనాఁడు, నానావిధ ప్రబంధ ప్రకారంబులు గోష్ఠీవశంబునం దలపోయుచు దృశ్యశ్రవ్య కథామయంబులగు కావ్యంబుల శ్రవ్యమాత్రంబుల మహాకవులచేఁ ద్రిలింగభాషయందు గ్రథితంబులుగ, దృశ్యంబులగు నవి తాదృశంబులు గామికిం జింతించి తద్గ్రథననిషేధ కారణంబుఁ గానక......సంచితోత్సాహుండై సంస్కృతాంధ్రమిశ్రంబుగాఁ బ్రాచీనాను శాసనోక్తలక్షణ లక్షితంబగునటుల సకల సరసపదార్థ వనీవాటి యగుఁ 'మంజరీమధురకరీయంబను నాటిక'ను రచించియుండెను." ఇందలి కథ యపూర్వము, స్వకల్పితము. ఇది ప్రాచీన సాంప్రదాయముల ననుసరించి కవులందఱు స్వీయపాండిత్యప్రకర్షయే ముఖ్యముగాఁ దలంచుచుండెడి కాలమున—అనఁగా మధ్యయుగమున—వ్రాసిన గ్రంథమగుటచే నాధునిక నాటకముల కంటె కించిద్భిన్నమై మిగుల పెద్దదిగా గనఁబడినను ఆంధ్ర వాఙ్మయమున కేవలము యక్షగానాది ప్రాకృతనాటక ఫక్కినిగాక, ప్రాచీనసంస్కృత సాంప్రదాయములననుసరించి నాటకమువలె లేనికాలమున బయలుదేరినదగుటచే నాంధ్ర వాఙ్మయమున నాటక శాఖకుమూలములగు గ్రంథములలో నిది యొక్కటియై యుండెననుటకు సంశయములేదు. ఇంతేగాక శాకుంతలము, వేణీసంహారము, ముద్రారాక్షసము మొదలగు సంస్కృత నాటకముల నింతకుబూర్వమే యాంధ్రీకరించి యీయుద్యమమునకు దారితీసినవారైరి. ఈసందర్భమున నీయన శిష్యులును రాజమహేంద్రవరమునందలి గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీలో ప్రధాన పండితులుగ నుండిన బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు తామాంధ్రీకరించిన ఉత్తరరామ చరిత నాటకమున కుపోద్ఘాతముగ రచించిన యీక్రింది వాక్యములు గమనింపఁదగి యున్నవి.

**"It is conceded on all hands that Dramas arv atleast as much a source of instruction as any other**

lepartment of knowledge. It is however unfortu-ıate that Telugu Language had till very recently aid no pretentions to the possession of Dramatic Literature. Thiswhs way the chapter on Dramaturgy nas been left untranslated by Bhattumurty in his popular treatise onRhetoric KavyalankaraSangraha The vedantic ' Morality' Prabodha Chandrodaya of Krishna Misra was . afterwards rendered into Telugu, but cnly east in the Epic mould. But after what may be termed the revival of Telugu Litera-ture has set in it has struck my Guru Brahmasri Korada RamaChandra SastryGaru of Masulipatam how sadly defective our native tongue was in Dramatic works—not to speak of the consequent absence of facilities to elevate the moral tone of the masses — that great Pundit translated Veni Samhsra of Bhattanarayana and other Damas' whose Telugu renderings have some how not yet got through the press. Mr. Kokkonda Venkatarat-nam Pantulu residing in Madras followed in the ·. ak end published his version of the Narakasura. Vijaya Vyayoga of Dharma Bhatta. Then Sreeman Paravastu Venkata Rangachariar Averghal of Vizagapatam commenced translating the Sankun-talam of Kalidasa.

ఇఁక నాంధ్ర సారస్వతమున ప్రథమమున గద్య కావ్యరచనకుం గడంగిన వారిలో నీయనయొకఁడని చెప్పఁదగియున్నది. నయప్రదీపమను విగ్రహాము ఈయన రచించిన గద్యకావ్యములలో మొదటిది. విష్ణుశర్మ విర

చితమగు విగ్రహ కథ యిందు విశేషముగా పెంచి వ్రాయఁబడినది. నూతనముగా రాజ్యమునకు వచ్చిన రాజహంసునకు మంత్రి రాజనీతి నుపదేశించె నను మిషచే ననేక గాథలతో గూడిన సుమారు డెబ్బది పేజీలు పరిమితిగల స్వకల్పిత గ్రంథమందుఁజేర్పఁబడినది. ఇది యొక్కొకచో దీర్ఘసమాస జటిలంబై, యొక్కొకచో నను ప్రాసోపశోభితంబులగు నచ్చతెలుఁగు పదముల యల్లిక జిగిచే నలరారుచున్నదై, నారికేళపాకముగల దైనను, ఈకవిచే రచింపఁబడిన "రథాంగదూతము" "పరశురామ విజయము" అను గద్యకావ్యములు మిగుల సరళంబగు శైలిని రచింపబడుటఁ జూడ నప్పటికే గద్యశైలియందలిరుచి (TASTE) మాఱుచుండె ననియు నామార్పున కనుగుణ్యముగనే యీయనప్రయత్నములు సలుపుచుండుటవలన నూతనయుగావిర్భావమీయన కప్పుడేకొంత సోకెననియు నట్టినూతనయుగ చిహ్నములే యీయనరచనలయందుఁ బొడసూపెననియు మనము తలంపఁదగియున్నది.

ఇట్లాంధ్రసారస్వతమున నూతనయుగావిర్భావమును సూచించు కవులలో నొకఁడగు నీరామచంద్రకవి కోరాడాన్వయుఁడు కౌండిన్యసగోత్రుఁడు ఆపస్తంబసూత్రుఁడు. ఈకోరాడాన్వయమునకు మూలపురుషుఁడగు మహాదేవశాస్త్రి యనునాయన శ్రీశైలపర్వతమున నిరువదియేడు దివసంబులు ఎండుమారేడాకులఁదిని తపస్సుచేయఁగాఁ దనకు సాక్షాత్కరించిన భ్రమరాంబికవలనఁ దనవంశ మేడుపురుషాంతరములవఱకు సర్వశాస్త్ర పారంగతులగు పండితులచే నెగడునట్లు వరముంబడసెను. అప్పటినుండియు నీవంశము పండిత వంశమై యలరారుచుండెను. ఈ వంశమున నల్లాడశాస్త్రి యను నాయన 'శతఘంటికా చూడామణి' యను బిరుదు వడసెను. ఈరామచంద్ర కవి తల్లి సుబ్బమాంబ. తండ్రి లక్ష్మణశాస్త్రి. ఈయన శ్రీరామ తారక మంత్రోపాసకుఁడు. వీరి నివాసము గోదావరిజిల్లా అమలాపురం తాలూకా నడవపల్లిగ్రామము. రామచంద్రకవి పిన్ననాటనే తండ్రియొద్ద శ్రీరామమంత్ర ముపదేశముబొంది శాస్త్రాధ్యయనముచేసి గ్రంథరచన ప్రారంభించెను. శృంగార సుధార్ణవమను భాణము నాయన 17-వ యేటనే

వించెను. మఱియు శ్రీ శిష్టుకృష్ణమూర్తి శాస్త్రిగారి శిష్యుడై యనర్గళ వితాధారతో సంస్కృతాంధ్రముల ననేక గ్రంథముల రచించెను.

శ్రీశిష్టు వంశాబ్ధి శిశిరకరుఁడు
సకలవిద్యాజన్మసద్మాయమాన జి
హ్వాంచలుండమిత కావ్యాళికర్త
యయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవ
నాత్తసద్గ్రంథకల్పనా విత్తసుమతి
విరచితశ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుఁడు

అని తనను గూర్చి మంజరీమధుకరీయమునఁ జెప్పికొనియున్నాడు. పిదప నీయన చెన్నపురిలో పండితమునసబీయుద్యోగము సంపాదించుటకై యిల్లువెడలి దారిలో బందరుచేరి యచ్చటకొందఱు స్నేహితులప్రోద్బలంబున నిలచిపోయి బందరు నోబిలుమిషన్ పాఠశాలయం దుపాధ్యాయులుగ ప్రవేశించి నలువదిమూఁడు సంవత్సరము లాత్మగౌరవ స్వాతంత్ర్యమునకే మాత్రము భంగమువాటిలకుండఁబనిచేసి పిదప పండ్రెండు సంవత్సరములు గౌరవ వేతనంబును బొంది శార్వరిసంవత్సర శ్రావణ బహుళ పాడ్యమి దినమున (1900) స్వర్గస్థులైరి.

ఆంధ్రదేశమందలి గద్యవాఙ్మయ శాఖకుఁ జెందిన మొదటిగ్రంథములలో నివియైనను ఇంతకాలము ప్రకటితముకాకయున్న రామవిజయమను గద్యకావ్యములు తజ్ఞుల యాదరమును బడయుఁగాత.

చెన్నపురి. కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ.,





శ్రీ ర స్తు.

# ర థాం గ దూ త ము.

శంకరమానితంబగు చలిమలకుఁ బ్రక్క నొక్క పురవరంబు రసికనందనంబనునది గలదు. అద్ది శుచియగుట జాతవేదంబయ్యు, నమృతసంపాదన పరాయణంబై యుండు. అప్రోవిలున పూవిలుకానినైనఁ జక్కఁదనంబున లెక్కింపని యొక్క తరుణుండను కవఁనుండు, వేల్పుమిటారులనైన సొగసుఁదనంబునఁ దనకు సరిగారని గర్వింపదు మొగలిమొగ్గ యనువేరఁ దళుకొత్తు వెలఁదితలకట్టును, దమదగు తలంపునఁ బెండిలిచేసికొని పూఁదావులంబోలి సంగతులై యాయిరువురుం బెక్కుతఱి తమకెంకిని నిష్టంబులగు సుఖంబులఁ జవిఁగాంచు చుండిరి. అంత నొక్కనాఁడా తరుణుండు తన వనితం గని, యో చెలీ! మన మిరువుర మొకకీలుబండినెక్కి వెడలి కానదీపించు సొంపులఁ గాంచు నుల్లంబు రంజిల్లుచున్నది; కాన కేగుదమా? యన నాచిలుకపలుకులవెలఁది సంతసంబున మిగిలిన డెందంబున నాతని కి ట్లనియె. ఓ చెలికాఁడా! నాకును 'బెక్కువారంబుల నుండి యిట్టితమి యుల్లంబున నిండియుండినను దేవర మనంబున కేమితోఁచునోయని సందియంబునొంది మందగతినై యుంటిని. ఇయ్యెడ నీకిట్టి తమిపుట్టుటంబట్టి యెట్టకేలకు నీ

పేర్మికుంబట్టయిలినని కొఱఁతవీడి యుంటిని' అనియాయలివ నుడువ నత్తరుణుండు వొంగినదెందంబుగలవాఁడై వనితో వసంతునిఁబోలి నాపెతోడఁగూడి యట్టి శకటంబారోహించి పనికి వెడలె. దారినడువం బొడమినవియు, వేడుకలడరించు నవియు నగు నాయాయి చమత్కారంబులఁ దనయిల్లాలికిఁ జూపుచు మిగులనర్మిలి నాలోకింపుచు నొక్కతావునకుఁజని యంతట నవలోకించి, తనప్రియురాలి కింపుసొంపుల సంపాదింప నిట్లని వినిచె—ఓముద్దుగుమ్మా! కాంచితివే? నిజకుసుమ విసర సంజనిత సువాసనలం జితమహితపన్నీరంబులగు నీరంబులఁ గుసుమస్తోమంబులు నీహారపాండురపటావృతంబులగు కశిపుల సొంపుల ననుకరించుచున్నవి. చందనమేదినీధరకందరాంతర మందమంద ప్రస్పందమానంబులగు పవమానంబులఁ గన్పించు చుఁ దీవియలెల్లనర్తనంబు సల్పుచున్నవివలె రాజిల్లు చున్నవి. శుకపికప్రభృతులైన నీయండజంబులెల్ల నీయండఁగడు వేడుక నీ వచనంబులరుచి నానలేక కూయుచున్నవి; గాని వానికి మెండుగ షండభావంబయడరె. ఈరావి పల్లవించి నీదగు మోవి చందంబు దలిరాకులఁ గాచుగాక, దానిరుచి నెట్లొందు. ఈ దాడిమి తనపండ్ల నీపాలిండ్లఁ బోలుటంగోరి తన తెలివిమాలిన దానితనంబు దెలియఁజేయుటకై పండులమెండుగాఁ గనిరియుం గాని వాని చక్కఁదనంబు నొందనెట్లు బలిమిగలుగునవియగును. వానివలనం బొడమినవియయ్యును నివ్వియగొనంబుల నెచ్చు దగ్గుల నెఱుంగునవియని యేనెంచెద. ఎందునుండి యనియంటి వేని ?ని?న నాలింపుము. ఆపిందెలు వరుసంబెరిగి పండిన

వగుచు వాని చక్కఁదనంబు దొరకమిం జేసి బీటలు నెంచిన మొగంబుతో మేము దాని పాలిండ్లసొంపు సంపాదింప రిత్త బలిమి కలుములమైతి మని వక్కాణించుచున్నవి.

మరియుం బిమ్మట బగులగొట్టంబడి చవులం దెలిసినవారి చేతఁ జప్పరింపఁబడుచున్నవి. ఇవి మొదలుగ్గల వాకుల వ్రాయుచుచు నాపె యుల్లంబుల్లాసంబు నొంద్దింపుచు నొక్క తీవెలకొంకి నిచ్చకు వచ్చిన మచ్చికలలర పాళ్ళి సలిపి సుమా ళంబుగ నుండిరి.

సురతవిరచితంబగు నాయాసంబునకు సాక్షారిరైయొప్ప బంధువు చందంబున, నడరునెండ మెండుగనవస్థ యా యనురూప తన వేడుకకానింగని, యోజీవితపతీ! నానమాని యెన్ని వారంబులు నీమోవినానినను ధప్పి తప్పకయ. యొప్పి దంబు గలిగియుండె. నిప్పుడేమి సేతునని వగచు నావగలాడిం గని యాతం డిట్లని వినిచె.

ఓసీ! ముద్దరాలా! నీవెంతజేలవైతివే? ఔషధంబులెల్ల నన్నిరోగంబుల నడంచునని తలంచెదవా? అట్లు దలంపం దగదు. అధరామృతంబు కామరోగ పీడితులకు హితంబుగాని తపనాతపాక్రాంతులకుఁ గాదు. కావున నీదూపనణంపఁదోరం బగు నీరంబానయించెద. నీ వీయెడ మనోవినోదనకరంబులగు నీచిట్టల నవలోకింపుచుఁ గాలంబు గడుపుచుండు నేను వేళం బుగ నేతెంచెద. ఇయ్యెడ దట్టంబులగు పత్రింబుల జొంపం బుల దమ్ముల సామి మరుగుపడఁ బైతట్టుగాంచి నల్లమబ్బను బుద్ది నెమ్ములు లాస్యంబులు సల్పుచున్నవి. అసదులగు

దెమ్మెరలఁ గదలుతీవియ లాడుచున్న భోగింపుచానలం బోలి మిగులఁ వేడుక లడరించుచున్నవి. మరియుఁ గమ్మతావుల నడరు కుసుమంబుల రసంబులంబీల్చి మత్తుగొనియున్న తుమ్మెదల రొదలనూనంబులగు గానంబుల ననుకరించుచున్నవి. ఇవ్వియాటకల వినోదంబులం దతిగడుపుచుండుము. నే వేగంబ పానీయంబానయించెద నని వాక్రుచ్చి, యచ్చటనుండి వెడలి యచ్చటచ్చటదిరుగు చొక్కయొడ విరిసిన సరసిజమ్ముల పరిమళమ్ముల పవనంబులు తనునాసాహ్వాపీకంబులకు విందొనరింప నిచ్చోంతనొక్క కొలనుండునని తలంచి, మించిననెచ్చరికందదభిముఖుండై, తత్రత్యచక్ర విశదచ్ఛద పుష్కరాక్ష ప్రముఖ జల విహంగమ మధురతర గంభీర విరావంబుల నాహ్వానితుండుం బోలె వేగంబెచని, ముంగల నొక్క సరసింగాంచి యందు కృతావగాహనుండై యరవింద మకరంద వాసితంబులు శీతంబులునగు నమృతంబులంద్రావి దగడిగనాడి, యాతపత్రాణ నిపుణ నిభంబులగు శతపత్రిణీపత్రంబుల నిర్మితంబగు నొక్క దొప్పయందు విమలంబులగు సలిలంబుల నునిచి, తావుననున్న యెడ మహార్హంబులగు భక్ష్యంబుల మెసవి తనివినొందు దానికిఁవ్వేళ నాఁకలియుం గలుగు నని యెంచి సంచిత సంరంభుండై హీరాంకుర గౌరంబులగు నభినవమృణాలనాళంబులఁ గోయుచున్న సమయంబున నొక్కరక్కసుండు పానుపాడి యనువాఁడు సద్యస్సంపిష్టకీకరాఞ్జనాంత మలినంబగు శరీరంబును, భల్లానన సమానంబులగు కోరల గుంద్రతనంబున దీంద్రించు నట్టియు నెట్టగోఁగుపండుల కెనయగుచు ఖాదిరాంగారంబుల

నిరసించుమినుకుల కలుముల నంతర్మాత్సర్యంబు చెలువుకరణిఁ గడు నతిభయంకరంబగు ముఖంబున లేఁతయొండవలె పచ్చదనం బున మెండుగ నిండియుండునవియుఁ నాజానులంబమానంబు లగునవియు నగు జడలచేతఁ దపించువాఁడై, తన జాడకాన రాకుండ వెనుకపట్టున నేతెంచి కూర్మోపరిభాగ కర్కశంబు లగు తనకరంబులం గట్టిగఁబట్టికొనియె. అప్పుడాతరుణమణి నిరాయుధుండు గావున నాతనితో నాలంబు సల్పనోపక ముం దేమి జరుగునో చూతమనుచు, వానికి వశ్యుండై యుండె. అంతట దోసంబులకు మూసయై విలసిల్లు నప్పాలసుతిండి కాఁడు నిజసంగ్రహణజాతభీతిచే నిశ్చలంబులగు లోచనంబులు గల యత్తరుణమణిని నిశ్చలంబుగఁ దన భుజపాశంబుల బంధించి యిరువునకుం గొనిపోయి, చెరసాలయందు నతికఠోరంబులగు నాయసశృంఖలలచే నిబద్ధచరణుం జేసి యొక్క ప్రక్కనునిచె. అంత నత్తరుణుండల్ల నల్లదాఁగివువాని నిగ్రహంబునం బొడ మిన మూర్ఛ దెప్పిరిల్లి కన్నులు నలిపికొనుచు మేల్కనిన వానింబోలి తనచరణంబులఁ దగిలికొన్న సంకెలలంగాంచి యంచితవిస్మయుండై, యంతట నవలోకించి తనవలె నిర్బం ధింపఁబడిన పెక్కు జనంబుల నీక్షించి యవశంబగు నంతరంగం బున నింగిఁ గాంచుచు బొంగినయార్తి నడరుచున్న నక్కడి వాంద్రడంజూచి యిట్లనియె.

ఓజనులారా ? మనకు నింత యార్తి యొనరించువాఁ డెవ్వఁడు? ఇట్టి పీడ యొనరించుటకుఁ గతంబెయ్యది ? మీకుం దెలిసెనేని వక్కాణింపందగు నని యన వార లాతని కిట్లని వినిచిరి.

“ఓయన్నా! వీని వర్తనంబు నీకుఁ దెలియదుకాఁబోలు. వీని
నడతం దెలియుటవలన బాగులుచున్న మేము నీకార్తిసేయ
నుచితంబుగాదని యెఱిఁగియున్నను నీవును మాలోనం జేఱుటం
బట్టి వక్కాణింపవలసి వచ్చె. రేద్రిమ్మరీఁడు నామమాత్రాన
మానుషాది గాఁడు. ఇఁక నేమన్నను వర్తనంబుచేత ననియుం
దెలియందగు. ఈపట్టెన మనుజుం దినదినంబున నొక్కొక్కని
సమయించి, వానితరసంబునఁ దనివినొందుచుండు. నీవు మహాను
భావుండవని తోఁచి యీవార్త నీకుఁ దెలుపవలసి వచ్చె”నని
యూరకుండిరి. పిమ్మట నతండు బొబ్బమెకంబు కేకవిన్న గబుం
మెకంబు చాడ్పున గుండియలవిసి యేమి యుఁదోఁపకుండి కొంత
తడవునకు డెందంబు పదిలపరచికొని, యిట్లని తన మనంబునఁ
దలంచె—జంతువెప్పుడు పుడమింబడునో, యప్పుడ మడియు
టయు దైవవిహితంబు కావుననే పుట్టువరికి నెక్కతంబున సమ
యుట దైవంబు నిర్ణయించియుండు, నద్ది యెవ్వనికైనం దప్పదు.
దీనికీ వగచిన నెంతమాత్రం జేని లాభంబు లేదు. కావున నిట్టి
సమయంబుననైన నీశ్వరుం బ్రార్థింపవలయు. జీవితసంపదయుండె
నేని నొక్క యాటంకంబుట్టంకితంబగు. లేకున్న బరలోకం
బెట్లయిన నీనిర్బంధ మరణంబునం బొడమిన పాపంబైన నశించు
నని తలంచి, యిట్లని యీయీశ్వరు వేఁడుకొనియె. ఓ దేవా!
నీవ సమావస్థానంబులగు సత్వరజస్తమంబులనియెడి గుణంబుల
వెలుఁగొందు మాయ నవలంబించి, రజోగుణప్రధానుండవయి
విధాతృరూపంబున నీవిశ్వంబుఁ గల్పించుచు, సత్వగుణప్రధా
నుండవయి నారాయణాభిధానంబునఁ బాలించుచు, నుచితసమ

యంబే తేర తమోగుణ ప్రధానుండవయి రుద్రనామధేయంబున నద్భుశ్యత నొందించుచు, మఱియుఁ దత్తద్రూపంబుల లోక హితంబునకై తత్తత్కార్యంబు లొనరింపుచుఁ దామర పత్రంబుపోలిక భువనసంబంధంబు లేకయుందువు. ఇంత మాత్రంబు పెద్దలయుపదేశంబున నెఱుంగుదు. నేను పురాణ ప్రణేతనుగాను. నేలమోయు పడగదారియుంగాను. వారల కును నీగుణగణంబులు వర్ణింప నలవిగావని నిగమంబు లను వదించుచున్నవి. ఇంతేమాత్రంబు నాకుం దెలియును. విశేషం బెఱుంగను. నీవు కనికరంబు కరంబవలంబించితివేని, యల మార్కండేయుని సవలోకితానేకచతుర్ముఖునిం జేయలేదా ? అది య టుండనిమ్ము. నీభక్తవరులగు వృషభయోగి మొదలు గలవారు రాజ్యభ్రంశంబొంది కడునిడుమలనొందిన భద్రా యువు మొదలుగల నాయకులచే నీపుడమి నేలింప లేదా ? కావున, నీవు గరుణచేఁ బ్రసన్నుండవైతివేని, నెవ్వనికి నెయ్యది సులభంబుగాదు ? శరణాగతవత్సలుండను బ్రసిద్ధనామంబు యోగరూఢత నొందింపఁ దలంచితివేని, యీ నాయంగద కడ ముట్టింపుము. పరుండవగు నీకుఁ బ్రణమిల్లెద నని పెక్కుతెఱఁ గుల వేడుకొనుచున్న యతనిం గరుణించి, యామహేశ్వరుం డతనికి లోచనగోచరుండై యద్దమరేయిం దక్కినవారు నిదుర గదుర నాతని కిట్లు వినిచె. ఓవత్సా! నీయేకాగ్రతను మిగుల నుల్లసిల్లితి. సమభిమతంబగు వరంబు వేఁడుమని యామృడుండు వల్క నప్పుడత్తరుణుండు ప్రదక్షిణ నమస్కారంబులు యథా విధి నొనరించి, దేవా! నీవు సర్వజ్ఞుండవు. నీకుఁ దెలియనిది

యీవిశ్వంబున నిసుమంతయుఁ గానంబడదు. అయిన నా యందలి యక్కటికంబట్టి యి ట్లంటివి. కానిమ్ము. నాకుఁ బ్రస న్నుండవై తివేని యీసంకెలికాంత్రను విగతబంధనులం జేయు మనిన నప్పరమేశ్వరుండతని సత్వంబునకును నుల్లంబునం గడు మెచ్చి యతని కిట్లనియె. ఓయీ! 'సర్వ స్స్వార్థం సమీహతే' యను నయంబున ముఖ్యంబగు స్వప్రయోజనంబు వీడి, పరార్థం బెందులకు జింతించు చున్నావు? తాఁగలిగిన గదా సర్వంబనుట వినవో? యన నమ్మహాదేవున కతండుకరంబులం జోడించియిట్లని విన్నవించె! ఓ దేవదేవా! దీనబంధూ! సకలభవబంధ నాశ కరంబగు నీ దర్శనంబున నే విగళిత సకలభవబంధ ప్రాయుండ నైతి. ఈ బంధంబు లట్లుండనిమ్ము. నీవాత్సల్యంబునకు బాత్రం బగునా యుల్లిపీరికైన సుమాళంబుకంటెం బరం బెయ్యది. 'పరోపకారాయభవంతి సంతః' యను నయంబున నీయ నుగ్రహంబునకుఁ బాత్రుండనైన నేను స్వార్థమాత్ర పరుండనైతి నేని, త్వత్సేవనపరుండ నెట్లగుదు నని వచింప నమ్మహేశ్వరుం డంతరుదితసమ్మోదకందళితస్వాంతుం డగుచు దయాసంతతం బులగు నపాంగంబులం గైకొనుచు నిట్లని వినిచె. ఓయీ! నీ యౌదార్యంబునకు మిగుల సంతసిల్లితి. నీయం తర్వృత్తం బె నెఱింగితి నని, స్వసంకల్పమాత్ర సన్నిహితంబగు నొక్కయాకురాయిని దయచేసి, దీనవారి సంకెలలఁగోయుము. అంతట మేల్కాంచి వానితో బోరాడి సూర్యోదయంబైన పిమ్మట వానిం దెగటార్చి, ప్రియాసంగతుండవై చిరకాలంబిష్ట సుఖంబు లనుభవించుచుండుము. తద్యుద్ధసమయంబున నా

యంశంబు నీయందు లగ్నంబై యుండుఁగావున వెరవేది వాని మడియించి, యీ యరణ్యచారులభయం బపనయింపుమని వాక్రిచ్చి యంతర్హితుండయ్యె. అప్పుడ యాతరుణుండు విగళితబంధనుండయి సంపూర్ణబలుండై యట్లొనరింప నంద ఱుఁ విగతబంధనులై యతనిని బెక్కురీతులనగ్గించిరి. అప్పు డమ్మానుషాది వారికలకలంబు లాలించి, యిద్ది మిగుల చిత్రం బుగనున్నది ప్రతిరాత్రియందును నిర్బంధపురుషులందఱును మామకనిద్రాభంగం బగునని భయంపడి మాటలాడక యూరకుందురు. ఈరేయిం జెలరేఁగి విచ్చలవిడి కలకలం బొన రించుచున్నారు. ఈదినంబునఁ బట్టువడిన మనుజుండు వారి వంటివాఁడు కాఁడు వీనివలన వాండ్రకుత్సాహంబుగలిగెనని తోఁచుచున్నది. కానఁ బరికింపవలయు నని తలంచి, యచ్చెర సాలకేతెంచి వెలుపటందాఁదాపిన బీగంబులు దిటముగనుండుట లోన గొండాడు నుడువులఁ దెలిసికొని, తద్వచన వాత సమా రాధితక్రోధోషర్బుధుండై తాళంబు శృంఖులతో విడిపింప నంద లివారందఱుం దరుణానుయానులై బరబర వెలికి విచ్చేసిరి. అయ్యెడ నారక్కసుండు విస్మయామర్షంబులు రెండునుందన మనంబును క్షోభింపంజేయ వారలనందఱనప్పుడ గెడయించె ద నని యుద్యమింప, నత్తరుణుం డాసుర వైరి కిట్లనియె. ఓరీ! నీవు చావు లేనివానివలె నీకాననంబున యాతాయాతంబు లొనరించువారికెల్ల ప్రాణహరణంబున యముండవయి యుం టివి. అప్పాపంబు విఫలంబగునే? వారివలె ప్రాప్తంబగు ఫలం బనుభవింపుము. నే నున్నంతవరకు వారిజోలికిం బోకుము.

పోటరివయితివేని యదరుమూని నాతోఁ గలి సలుపుము. వీరు భగ్నంబులగు నీయంగంబులం గనికాని, యియ్యెడ వీడరు. నీవు బ్రతుకందలంచితివేని యీరాష్ట్రంబువీడి మరియొక రాష్ట్రంబునకుంబొమ్ము. లేకున్న నాతో సంగరంబు సల్పుమన నప్పాఁసుమేతరి దండాహతచండపుండరీకంబుభంగి గనలి దంతసంఘట్టనంబునం బొడము మిడుఁగురులకు గన్నులంగ్రాలు విస్ఫులింగంబులకుం దోడుగా నతిదారుణాకారుండై రోషావేశంబున గైదువులుంజేకొన నిరవు సొరనొల్లక సింగంబు పగిదినార్చుచు, నోరీ మనుజకీటమా! మానిసులందెవ్వాఁడును నిట్టిబడాయిమాటలు వాక్రుచ్చినవాఁడు లేఁడు. ఇప్పుడ నీవలన నీబీరంపు పలుకులు వింటిని. బెబ్బులిచెంగటఁ దబ్బిబ్బువడి మదంబున నొడలు మఱచియున్న యిట్టివలె నార్చుచున్నావు. కావున నిన్నీదినమంత మడియించి నల్లంబిల్పి యుల్లంబురంజిల్ల నీతరసంబు వంటయింటికి నంపెద. ఇత్యాదులగు నుడువులు మినుకుచు చీఁకటిమాని కొమ్మసిగ నతిమసృణంబులగు పత్రంబుల నలకు దానివాని సిగంబట్టి వంచి, వాని వీఁపున వజ్రసంపాతనిభంబగు మోచేతిపోటు నడరింప నతండును సముత్కటవేదండ శుండాఘాతంబునఁగనలు కంఠీరవంబు భంగి పొంగుచు వానిపట్టు విదల్చుకొని, నానావిధంబుల మల్లయుద్ధపరిపాటి నడరించి, వాని వెలికిలంబడం ద్రొబ్బియుక్కున౯ మిగిలి వానియక్కునం గఠోరశిలాపాతంబుఁ దలపింపఁజాలు మడమతాపునఁ బగలింప నత్తావునుండి వెడలుశోణితంబు నోరును, ముక్కులు, గన్నులు, చెవులును వెడలింప, నారక్క

సుని మోము క్రొత్తమొయిల బయలుబ్బిన నీరంబులచే నావృతంబైన జేగురుకొండతటంబు విడంబించె. అయ్యెడ నయ్యిరువురు నొండరులం బిలుకుమార్చు తలంపుల కింపగు జతనంబు గలిగి నిజచరణసంఘట్టనంబులం బుడమి మోయు చిలువలరాయని పడగలంబోలె దెసలనుండు గారుల శిరంబుల సన్నతంబులఁజేయుచు, సారెసారెకు సింగంబుల పగిది నార్చుచుఁ బరస్పరాక్షేపవచనంబులం గనలుతోడ యూ యుత్స వర్థిల్లంజేయుచు నట్టునడని యుత్సాహంబుల "నీవు మత్సముండవా?" యని యధిక్షేపించుచు దృఢఘటితంబులగు పిడికిలులం గ్రుద్దుచు, మోచేతులం బోడుచుచు మడమలం దన్నుచు భుజపాశంబుల బంధించుచు నంగంబులు భగ్నంబులగునట్లు నేలకుం బడఁద్రోయుచు విదళిత పత్రికనికరనిర్గత రుధిరధారలఁదడిసినశరీరంబులు నిర క్రాంతంబులగు జాజుమలతటంబుల ననుకరింప బీతిం జలింపక పోరుచుండిరి. అయ్యెడ నయ్యిరువురు ఘోరంబగు బీరంబున బోరుచుండ వెన్నెలమినుకులదొర ద్విజరాజుండగుట నానల్లత్రావరి యొడలునం బొడమిన నెత్తుటిబొట్టులు తనపైఁబడు నేమో యను తలంపున, నపరమహీధర కందరాంతరంబు మాటుచేసికొన, వీరి భుజసంస్ఫాలన పాద ఘట్టనాది జనిత వేగంబునం దన కాశ్రయంబులగు మహీరుహంబు లేమగునోయను భయంబున నీడంబులవీడి యంతటంబరచు శకుంతవ్రాతంబుల వాశితంబుల దెసలెల్ల నావృతంబులుగా, నీరక్కసుండు నిక్కంబుగం జచ్చునని తెలుపుకరణి, మేల్కొన్న మరాళాది విహంగబుం

లనినాదంబులు విలసిల్ల వీడు మడసిన వెనుకం జెరబెట్టిన ఖాట సారులందఱివ్విధంబునఁ బ్రియురాండ్రతోడం గలిసి వర్తింతురని యెఱింగించుచందంబున గోకంబులు చెలులున్న కడకే తేర, సుకుమారాంగ లలితుండగు నుత్తరుండు ప్రతిదిన సంభుజ్యమానమానుషామిషుండగు నీయనిమిష విద్వేషితో ద్వేషంబుఁ గైకొనియె. ఏమగునో యను విచారంబునంబోలె గుముదంబులెల్లం గుముదంబులుగా నుత్తరుని జయశ్రీని సూచించు వానికరణి నరవిందంబులు మిగుల సుందరంబులై విరివిగ విలసిల్లఁ గైరవోదర నిర్గతంబులై మింటికెగయు బంభరంబుకలనాదంబులు తరుణోత్సాహకరంబులగు వందులగానంబు లనుకరింపఁ బూర్వదేవతాజాతి మనుష్యక్రవ్యభాదిని యని ప్రసిద్ధమాత్రంబుగాదు. వీఁడు జతనంబునం బురుషులం బట్టి తెచ్చి బందీ గృహంబున నిర్బంధించి దినదినంబునఁ దినుచుండు. ఈయుదంతం బెఱింగియు నీతండు తన సౌకుమార్యంబు నెఱుంగనివానింబోలి వాని నెదుర్కొనుచున్నాఁడు. ఆహా! ఇది మదోత్కటంబుపై నెగయు సింగంబుపిల్లచందంబుగాదె. యే మగునో చూతమని తలంచువానివలెఁ బ్రత్యగ్రపద్మరాగ మణీవినిర్మితముకురమండలాభుండగుచు నత్తీలత్యుండయ్యె. సాధుజనేతర పాదగ్రహణ విముఖుండగు నాకు వీని పాదగ్రహణంబు సేయవలసివచ్చెనే యని కొంతసేపు చింతించి, యుత్తరుండు వానిపాదంబులు వట్టి చుట్టుగ గిరగిరం ద్రిప్పి, యచ్చట నున్న యొక్కబండమీఁదం బడునట్లు మీఁదికి విసరివైచె. అంత నమ్మానుషాది యాబండమీఁదంబడి

విదళితసర్వప్రతీకుండై ప్రాణంబులు విడిచె. అయ్యేడఁబగతుని సమయించి తమప్రాణంబులఁ బాలించిన యమ్మహామహుని చరణంబుల కెఱఁగి బహువిధంబులఁ గైవారంబులు సల్పి, యో మహానుభావా! నీప్రాపున మేమందఱము నిజజనవిలోకన పాత్రంబుల మైతిమి. మా కు వంశకరుండ వీవ. మావంశంబు వారల కెల్ల నీవ పరిధమార్చనీయుండవు. బాటసారుల కందఱకు మృత్యు ప్రాయుండైన వీనిసమయించుట సకలపథిక నికరజీవన ప్రదుండవయితివని బహువిధంబులం గొండాడి, యతనిచేతం గృతమంగళాశాసనులై, యనావృష్టి పీడితంబులై వినాశోన్ముఖంబులగు పర్జన్యదత్త నీరాప్లుతంబులై విలసిల్లు సస్యంబుల వలె, విలసన్ముఖులగుచు దమతమ తావులకుం జనిరి. పదపడి యత్తరుణుండును సమరసమయ సంసక్తశోణిత ప్రక్షాళనంబు సేయ నాకొలనికిం జేరి, కృతావగాహనస్నానుండై నిర్మలుండగుచు, పటికార్చిన బంగరు బొమ్మకైవడి విలసిల్లుచుఁ దన యిల్లాలు బుద్ధిసేరగఁ దనమనంబున నిట్లని తలంచె. ఆహా! ఇయ్యేడ దయ్యంబుగొన్ని కతంబుల నభిమతం బొడగూర్చినను నొక్కకతంబున జేతంబునకు మిగుల వింతగలుగఁజేసె. ఎన్నండును నడవిపాడసూడని యావేడుకకత్తె నచ్చట నుదితశాంతయై దూపదూపంజాలక సందియంబువీడి పానీయంబులం గోరె. నే నిదె వచ్చెద నని కొన్ని కాలవినోదనోపాయఁబులం జెప్పి యే తెంచితిని అప్పొలఁతుక దప్పిచే నేమయ్యెనో? అచ్చటి శ్వాపదంబుల నేమయ్యెనో? దాని కుచకుంభంబులం దమకుంభంబులు [illegible]ంబు లగుటం గనలిన మదోత్కటఁబులవలన

నెట్టికడగండ్లఁ గాంచెనో? తమ యవలగ్నంబునకు జేతయగు దాని నడుముంగని సింగంబు లేమి కీడుఁగావించెనో? కమలంబులు నయనంబులఁ జితంబులగుట నెట్టియాత్రంబునకు పాత్రంగావించెనో? ఇక్కాన కానవెట్టి నప్పుట్టతావులు దాని నూగారుచే గెలువఁబడినవగుట నేమిగొడవం బొడమించెనో? యని చింతింపుచుండ, నాపెచేఁ బుత్తెంపఁబడిన యొక్కచక్రవాకంబు తొల్లి యాపె వినిపించిన గుర్తుల నత్తరుణుంగా నెఱింగి, నుసుప్యోచితంబులగు వచనంబుల నిట్లనియె—ఓయీ! నీవు తరుణాభిధానుండవు గావా? నీచెలి సజీవితయై యున్నది. నీవు సుఖముగ నుంటివిగదా! యనఁగ నతండ బంపు కడలిలో మునింగినవాఁడై ప్రేయసీ కుశలవార్తాశ్రవణజాతప్రీతసంతతస్వాంతుం డగుచు, సంతోషవిషాదంబులు దన శేముషికి మోహకంబులుగాఁగఁ దనకతయంతయు వినిచి దానికత యడుగ నక్కోకం బిట్లని వాక్రుచ్చె.

ఆపె సెప్పినమాటల నాలింపుము. నీవా పెదూప నార్ప నీరంబులం దెత్తునని బయలుదేరిన పదంపడి, యెక్కడనుండి వత్తువో యని యంతటం గాంచుచు, గొంతసేపక్కడనయుండి యెంత తడికి నీజాడఁ గానలేక, యెండిన పెదవులతో వెచ్చనూర్పుచుంబొడమిన తనదగబాదకు నీయెడబాయుటం గలిగిన వేండ్రంబు తీండ్రంబుగ దోడ్పాటు గాఁగ, నచ్చటనుండి వెలువడి యక్కడక్కడం దిరుగుచు మిగుల నలసి యొక్కచెట్టు మొదటఁగూర్చున్నయెడ నొక్కతాపసి, కైలాసదేశంబువోలె రుద్రాక్షమాలాలంకృతుండును, ప్రజాపతిబాతి భారతీపతియుఁ

గేశవు వడువున హృషీకేశుండును, మహేశ్వరుకరణిఁ గృత్తి
వసనుండును, వైవస్వతుచందంబున దండధరుండును, భాస్క
రునిభంగి మహాతేజుండును నై యరుదెంచువానిం గాంచె.
అతండును దీనదయాళుండుగావున నాపెంగని, యోయమ్మా!
నీవిట్టాన నిట్టిరూపంబులు దాల్చిన కలుములరాణి కరణిం
దీపించెదవు. నీ వెవ్వరిదానవు? నీవిప్పట్టున నిట్లుండుటకుఁ గతం
బేమి? యని యడుగ, నాపె యాతపసులరాయునింగని యిగిరిన
వాతెరగలది యగుట వాక్రువ్వంజాలక నాకమండలువుపై దృష్టి
నిలిపి, పలుమారు తనవ్రేళ్ల నరుణసహస్రదళదళసహచరంబుల
మోవి సేవించియుండె. అంత నత్తపసులతలకట్టు దానిదూప
నణంపందలంచి యాకమండలువునున్న పానీయంబులు విమలం
బులు దానికొసంగి, పిపాస శమియింపంజేసి, దాని యలసత శమ
యింపంజేసి దాని సుద్ది యడుగ, నాపె తనయుదంతంబంతయు
నాతనికి శ్రుతిసంగతం బొనరించి, యోయయ్యా! యిచ్చటనే
దూపనలసి పానీయంబులు గోరనిదె తెచ్చెద నని జాముకు
లోగడ వెడలె. ఇంతవట్టుకుఁ జెలికానిజాడ బొడమదు. నేనేమి
సేతు? జీవితంబు నితాంతంబు బ్రీతికి నికేతనం బని కదా మీ
రిచ్చిన పానీయంబుల నానితి. ఇప్పుడతని యెడబాటు సైప
నోప. ఎందుకు ద్రావితిని? త్రాగకున్న నసువులు వోవుంగదా?
అట్లయిన నీయెడ బాటునం బొడమిన కడగండ్లు వోవకమ
కుండునే యని విలపించుచున్న దానింగని, యాయోగి పుంగ
వుండు దాని యెడంబట్టిన యక్కటికి కలవాఁడగుచు, యోగ
దృష్టి నవలోకించి యామె కిట్లనియె. ఓయమ్మా! యుమ్మ

లింపకుము. నీప్రియునకు సుఖంబయగు. రేపటిదినమందు గాని నీకాతని సంయోగంబు గలుగదు. ఇద్దినంబు దుర్దినంబని తలంపుము. ఇది నిక్కంబు.ఏమో వినిచితి నని తలంపకుము.ఇచ్చటం బెబ్బులులు తోడేళ్ళు మొదలుగల నృశంసజంతువులు సంచరించుచుండు. కావున నిచ్చోంతన మామకంబగు నుటజంబున్నది. అచ్చట కేతెంచి,యీరేయి నచ్చటంబుచ్చి రేపొక్కప్రహరంబు జరుగ నతనింగలిసి కుశలంబుగ వర్తింపఁగలవని వాక్రువ్వ, నతనియాదరాకార నిరీక్షణాదుల నతని యందుం జెందిన పితృభావంబు గలదియై, యాయనతోడఁ గూడఁజని యచ్చోటుననుండఁ దదీయదుర్దశంజూడ నసమర్థుండ పోలె రవియు నస్తగిరి కేఁగె. తమ్ములుం దమ్ములవలె దానివంతవింతయై యొప్పు దానింజూడ నోపమింబోలె వికాసంబుఁ దప్పియుండె. తమంబులుం దమంబులు దానియంతరంగంబు గప్పినట్లు నెల్ల యనంతానంతాంతరంబుల నావరించె. చక్రవాకంబులు దమకుఁగుచంబులం జెలియగు దానివిపదం జూడనోపనివియుఁబోలె ప్రియవిరహంబుననైన వేసటంజెందె. చుక్కలుం బగరలవలె దమకు నీడగుదాని యంగదఁగనుఁగొన నిచ్చగించినవియుఁబోలె, మినుకుల కలుములనుల్లసిల్లె. కుముదినులును జ్ఞాతరమణ సంయోగి వియోగజన్య దశలగుట నిజప్రసవోదర నిర్యన్మధుకర ఝంకారధారా వ్యాజంబున నోదార్చుకరణి విలసిల్లఁజంద్రుఁడును దానిసుఖంబునకు సఖుండగుట నుల్లసత్కళంకుఁడై దానియంగదంబోఁగొట్టుమని పెఁడుకొను వనుభంగి నిష్టపదం బాశ్రయింప, నాయఁతి మేలుబంతి వంత

నాకాక్రాంతయై యున్నను గారుణికుండైన యత్తపసి యొసంగిన ఫలమూలంబుల మెసవి నీరంబులం ద్రావి యెప్పుడు తెల్లవారు నను తలంపున నారేయి వెళ్లఁబుచ్చె. అంతఁ బ్రభాతంబు గాఁగ, నాతపసి లేచి స్నానార్థంబు దూరస్థితం బగునదికిం బోవఁ దమకింప నాపె యాయనకు బ్రణమిల్లి విరచితసమభిహితాశీర్వాదకయై యచ్చటనుండి వెడలి, యాకాన నంతటం దిరుగుచు, సకలసల్లక్షణలక్షితంబగు నొక్కకేళాకూళిం గాంచి యచ్చటి నీడోద్భవంబులనెల్ల నీక్షించి, తా నాఁకటిబాధ నొందినవాఁడుగాని యెదుటివాని యాకలిబాధ నెఱుంగఁడు గావున ప్రియవియోగజంబగు వంత దెలిసినవాఁడ నాయదరుడుపంబ్రోడయగు నని తలంచి, యొక్కచక్రవాకంబుగాంచి యిట్లని వేడుకొనియె— ఓరథాంగరాజమా! నీవు దోషాచరసమయవిరసుండవు. దయితచేతఃప్రమదసంఘటననిపుణంబు లగు మా హృదయజాతంబులకు నత్యంత ప్రియవయస్యం బగు నాకారంబున విలసిల్లువాఁడవు. సువృత్తాత్ముడవు. సువర్ణతేజుండవు. నియతంబుగఁ గమలాపదసంచారివి. త్రయీతనుండగు మృతండపుత్రుని యనుగ్రహంబున శర్మంబుల ననుభవింపం గోరినవాఁడవు గాన నిన్నొక్కటి వేఁడెద. తొల్లి యొక్క మరాళకులవతంసంబు నలనృపగుణబద్ధ చేతస్కయగు దమయంతికిఁ దద్ఘటనం బొనరించి జీవింపజేసిన విధంబున, సహజానుకంపాలంకృత హృదయుండవై, ప్రియవిప్రయుక్తయగు నాకు సంతసంబు సంధిల్లంజేయ నామనవిఁ గైకొని, మదీయప్రియుండొక్క కాసారతీరంబున నుండుం

గావున వానింగని, నీవిట్లు వక్కాణింపందగు. యాతాయాతం
బుల సేయువారు,నచ్చట నాసీనించి యుండువారునగు జనంబు
లలో నీ ప్రియుం డెవ్వండని దెలియందగు నంటివా? యతని
లక్షణంబులు నిక్కంబుగ వక్కణసేసెద నాలింపుము. ఎవ్వని
సిగముడి చందురుండని బమసి యావరింప నేతెంచి యతండు
ప్రతివీర ప్రభంజనుండని దెలిసి వెనుకన యడంగి పిండీభూ
తంబై యుండిన కాండవాహు కరణినుండు;ఎవ్వని కనుబొమలు
శ్రవణకాయమానం బారోహణంబుసేయ నకుంఠ సముత్కం
ఠాభరంబున వెడలు కోమలవల్లుల ననుకరించు నెన్నొసలైనం
దనమినుకులకుం గృష్ణపక్షాదిసంబంధంబున హాని రాకుండంగ
నధఃకృతశృంగుండై యేతెంచిన యరనెల నిపుణంబై యుండు.
కన్నులన్న నాసికావరాటకంబునం బొల్చు లపన నలినంబుల
దళంబులయి యొప్పు, గళంబైన ముక్తాహార పరివేష్టితంబు
గావున సముద్గీర్ణ ముక్తావళియగు కంబుపుకరణి ననుకరించు.
విపులంబగు నురంబును, నియుద్ధంబున వనగజ దశన ప్రహారం
బులం బొడమిన కాయలచాయల కాలయంబగుట నంతరప్రరో
హాత్ పురందర నీలమణి ప్రరోహంబుల విలసిల్లు మణిపర్వత
ప్రపాతంబుబాతి నవఘళించు. మధ్యంబయిన శరభంబుచేతం
బరాభవంబు నొందుచు మృగరాజని పేరూని తనుమధ్యల
జయింపలేక వారిపాలిండ్లకు సరియైన కుంభంబులందాల్చు మస్తు
మెకంబుల సంహరించెదవు నీకు శూరతగలిగెనేని నాతోడం
బోరాడుమని పిల్చు చందంబున నమంద సుందరంబై నయనోత్స
వం బొసంగు. పెందొడలైన నిర్విశంకవన విహారణంబున

మస్తుగొన్న వేదండంబుల శుండాదండంబుల విడంబించు పిక్కలైన నక్కజంబగు రూపంబున మిగిలి పూవిలుకాని తరకసంబుల నీసడించు. అడుగులైతే తలిరాకులం బోలె నల నలంబుల నాలంబునకుం బిలుచు. ఈచిన్నె లెవ్వానియందు జూపట్టు; వాని నాయొడయనింగా నెఱుంగుము వక్కాణసేయ వలసిన బాసయేది యని యడిగెదవా ? నుడివెద నాలింపుము.

ఓచక్రవాక చక్రవాక చక్రవాక చక్రనాయకా ! నాయం దనుకంపం గంపింపక ననన్యమనస్కుండవై యాలకింపుము. నారమణుం డివ్వనంబున విహారంబు సల్ప నిన్న నన్ను వెంట నంటించికొని యేతెంచె. పిదప కొంతసేపటికి దూపనాపంజాలక బయలురికిన వెతల నతితాంతయగు నాకుఁ బానీయంబులం దెత్తునని యత్తఱిన యరిగి యిదివరకును రాలేదు.

లోకంబునఁ బురుషులకంటెఁ గామినులకు రిరంస బహు గుణంబు లెక్కువని నీవ వినియుందువు. అది యటుండ నిమ్ము. రాత్రులఁ బొడమిన యెడబాయుటలం గల్గిన వేదన నీవు ప్రొద్దుగూకినది మొదలుగ తెల్లవారుపర్యంత మెఱుఁ గుదువుగదా ? నెలతల కయ్యది యధికంబగుట నీలలన లలి తంబులం దెలియవచ్చు. మరియు నీమనంబు నీచెలిమోముం జూడ నెంతవేడుకఁబడుచున్నది. నీవీ సరసితటంబునకు నిల్లాలి నాలోకింపఁజను నెడ నామగని యుదంతంబు తెలిసికొని వెస నేతేరుము. నీవచ్చుట నావయితుం గన్నట్టులయిన నిట్లని వచి యింపుము. ఓఘూర్తశిఖామణీ! జనవిరహితంబును, దుష్ట మృగసంకులంబునగు కాననంబునఁ బిపాసార్దితురాలు నసహా

యయు నైనకామినిని వీడి నీరంబులం దెచ్చెదనని బయలు వెడలి దాని మఱచి దూరంబుగఁ దిరుగుచున్నావు. నీకిద్ది యుచితంబె, నీవసమర్థుఁడ వనందగదు. బలంబుచే సింగంబుతోడను, నడకచే మదగజంబుతోడను, వేగంబుచే విహంగపుంగవునితోడను, రూపంబుచే మీనకేతనునితోడను సమానుండవు. సముపాసితాంతర్వాణి యగు నీరాణి తన దగు గుంపు వలనం దొలంగిన కురంగాంగనవలె పారావారాంతరంబునుండి తీరంబునఁ జిమ్మిన మకరనారివలె నరుణుం డుదయించిన పిమ్మటఁ గుముదినికరణి కాననంబునం బరివేదననొందుచున్నది. కార్యాకార్యంబులం దెలివిలేని యలమానినులయ్యును నవనవంబయి తన చెంతనుండు తీవియ విడనాడి యొకప్పుడైన నొక్కయంజరయైన వెలువడవుగదా ? అచేతనంబుల యందయి ట్టివిధంబుగ నర్మిలి మర్మంబులనలరియుండ నీవిట్లుండ గడునబ్బురంబు గదా ? నీవును స్వవచనంబుగ నిట్లనుము. మేము పులుగులమైన దైవనియోగంబునం బొడమిన వియోగంబు సార్ధయామత్రయంబుకంటె నధికంబుగ నోర్వం జాలము. ఇట్లుండ కారడవిని నర్మిలి చేడియపీఁడి రక్షక హీనఁగా నెఱిఁగియు నిట్లు సంచరించుట మాబోటరులకును నగం దగినవాఁడవై యుంటివి. నీకు నీరంబు దెచ్చెదనని వచ్చినతర్వాతఁ దామరతీవెల వదలి రవి యెంతసేపున్నాఁడు. కడువేగంబునవానిం గలసెగదా ? యీసంగతి నీవెఱుంగుదువా లేదా? వచింపుము. గబ్బితనంబున నుబ్బునల మబ్బు మెరుపు దీఁగ విడియుండుట యొక నిమిసంబునఁ గదా ?

పవలు దూరంబు సేరఁదిర్గికకు వత్తి నెడబాయుట రెప్ప పాటుకాలము గలదే? తేలిరి రిక్కలగమింగూడక నాకంబు సైకంబు తఱియయుండు. నీదగు నెడఁబాయుట యతి చిరంబై నిబ్బరంబగు నబ్బురం బుబ్బఁజేయుచున్నయది. ఓయీ! యక్కటికి వీడినవారికిఁ దలకట్టైనవాఁడా? యాచెలి నెన్నడైనఁదలంచితివా ? దానిచేత నెప్పుడైన నీతలంపున కెక్కెనా? యెట్లయినఁ దోందరనంది రమ్ము. నీతరుణిసిబ్బితి చే ననుచితభాషితగాదు. మగని దూరుటచే పాపంబగునని మిగులఁ దెలిసి పదిలంబుగన యున్నది. మేము మిక్కుటఁ బగు రెక్కల బలిమి గలుగుట నెల్లెడలఁ బుడమియందుఁ దిరుగువారమైనను బతనశీలురమయ్యును గులశీల మర్యాదలఁ గన్నాకులైనవారిచే దూరంబడిన కర్జంబుల నంటకుండుటకై యొగయువారమెయగుదుము. ఇది నిక్కంబుసుమ్మి. కార్యవశం బున వచించితినని యెంచందగదు. ఓరథాంగ పుంగవా? నీవి చ్చటినుండి వెడలి నాచెలికానింగని నాయుదంతం బంతయుఁ జెప్పితి వేని నాయుసురుల రేనిం గలిసి యొక్కసారి యంక పాళి సుమాళంబుఁ జవిగొని పదం పడి జీవితవ్యయంబు చేత నైన లభ్యంబైన వస్తువు నీకోసంగెద. ఇట్లని యతనిఁ బంపి, చిరవిరహ వ్యథితయగు నీప్రియురాలిం దోడ్కొని యితర కార్యంబు లెల్లం బరిత్యజించి సత్వరంబుగ రమ్ము. నీవు సత్వరంబుగ రాకుంటివేని ప్రియవంచితంబగు నీతనువు తనూన పొత్తున కప్పనంబుచేసి మెలంగెడు. నీవాతనిం దోడ్కొని వచ్చితి వేని, ముందుగఁ దలిరిటాకులంబోలు నీయడుగుల

నర్పించెద. మహామహీవరుల మణి గణంబుల నంతటఁ బరిగుంభితంబును మీఁదను క్రిందను బ్రత్యగ్రపయో విశదంబులగు పటికంపు పలకలగూర్పంబడినదియు వెలమిగిలిన ముత్తెంపు సరంబుల నలరినదియు మణిమయంబులగు చిరుగంటలచేతను పయఃఫేన పాండురంబగు నాతపత్రంబుచేత విచిత్రరూపంబుల నలరు వితానంబుచేత విభాసితంబును సౌదామనీ మానినీయలగు మానినులపాణిశోణపంకజంబుల సారెసారెకు నూపఁబడినట్టియుఁ బ్రక్కనున్న బావియందలి తమ్మిపూవుల వాసనలకు నోఁతరులగు కరువలులకు దారులగు కిటికీలనడుమ నొడఁగూర్పఁబడినదియు, నపరంజి కణికల గణితంబునగు పంజరంబున కెల్లెడలను నీకై యొసంగెద. ఓచెలికాఁడా! మధుర తరఝుంకార కారులగు మధుకరంబుల నలరునట్టియు, మకరందరసభరితంబులునగు కుసుమగుచ్ఛంబులఁ బరిమిళితంబులత్యంత మధురంబులును బహువిధరుచిరంబులునగు ఫలజాలంబుల నానతంబు లగునట్టియు నీడల దిట్టంబులగు చెట్లుచే బోఁగొట్టబడిన పగటియెండలుగల చెట్లుచే దట్టంబగునదియు మధురరవంబుల నలరు విహంగంబుల లలితంబునగు మదీయోపవనంబున నింటనుండ సమ్మతంబు గాకుండె నేని వసింపుము. ఓరథాంగపుంగవమా! నీకు నాయారామమునందుండ నిచ్చ లేకున్న నయనంబుల కానందకరంబులగు కనక కమలంబులఁ బ్రసాధిత మధ్యదేశంబును మందగంధవహ ప్రసరణస్పంద మానంబులగు సలిలవేతసంబుల సంకల్పిత ప్రాంతంబును విమలిత కలధౌత విశదసికతా వితతి సంతతతీరోద్భాసితంబును సం

లక్ష్యమాణా ధస్థలవర్తి సికతా కలితంబులగు మలయజంబగు సరసి రజనియందు నీకుం బ్రియురాలితో విరహంబుగలుగ నీకు స్నానంబుకొఱకు నియమించెద. మఱియుఁ గ్రమంబున నాదేవ తలనెల్ల గొప్పలగు జతనంబులచేత నపరిమితంబులగు ప్రణతుల చేతవారల సంతసిలంజేసి యత్నాతిశయంబున వారివలన నమృతంబు గైకొని బంగారు కోరయందుంచి నీకుంబానంబు కై యొసంగెద. నందనవనంబున సంక్రందనుం డచ్చర మచ్చె కంటులతోడం గూడి హాళిమెరసి పూవులం గోయునప్పుడడ కువమీరం బ్రార్థించి, కల్పసాల ఫలంబుల సంపాదించి తెచ్చి నీకాహారంబున కొసంగెద. ఓ విహంగపుంగవా! నేను మాత్ర మిట్లుండుట గాదు. ఇఁక నేమన్న జగంబుల జయింప నిచ్చచేఁ బెచ్చువెఱిఁగిన పచ్చవిలుతుని యనీకినుల మచ్చరంబులఁ జూడందగు నావారగు చెలికత్తెయలును సద్యోవికసదరుణ నీరజంబుల నీసడించు పాణిపల్లవ పరంపరలయందు నేమంబున ననులాలింపంగలరు. చిన్నతనంబునందు నాచేతఁ బెంపఁబడిన నీడోద్భవంబులు నెమ్మలును జాతకంబులును, పరభృతంబు లును కీరంబులును, శారికలును మొదలు గలిగినవి, సంతానం బులవలెఁ బెంపబడిన నగుట నాకువిధేయంబులై యెల్లకాలము నిన్ను గొలుచుటయందు సాదరంబులై యుండఁ గలవు. మరియు నాప్రియుండును నీవొనరించిన యుపకారంబునమిగుల సంతసిల్లి సభలయందు నొరులకుపకారంబుసేయ నియతశీలుండ వగు నీగొనంబులఁ గొనియాడంగలండు. నాదాసీజనంబులును జమత్కార కథలు నుడువ నత్యంతాసక్త చిత్తంబులగుచు

నీ చెలికత్తెను సంతసిల్లం జేయఁగలరు కావున నో యవక్రవిక్రమా చక్రవాకచక్రరాజమా నీ విప్పుడేగుము. నాప్రియునిం గనుంగొని నాకష్టదశ యావత్తు నతనికిం గనికరం బుప్పతిల్ల వచింపుము. నాప్రియుం డిదివరకు పరుషభాషణంబుల వినలేదు గావున చల్లని మాటల నతని యుల్లంబు పల్లవింపం జేయుము. ప్రియుని యెడబాటు నొందింప నాఫక్కిని కనికరంబుప్పతిల్లం జేయ జాలినవచనంబుల నిట్లు వేడుకొన్నదై ప్రియుడు దన్ను వీడి వెడలుటం బొడమిన యంగదంగలిగినకన్నీళ్ల నావృతంబులైన కన్నులు గల దగుచుఁ దనకర్జంబు సక్కజేయ నాచక్రవాకంబు జిరకాలంబున కైన నెగసినదానిఁగా నెఱుఁగకుండె. తరువాత నత్తరుణిదృష్టికిఁ దిరోధాయకంబులగు నస్రంబులఁ దుడిచికొని సందేశవచనము బాపఁదలంచుచు,వృద్ధినొందు ననలసదృశంబగు విరహదుఃఖంబున బునరుదితబాష్ప సలిలావృతలోచన యగుచుఁ దానిఁగానదయ్యె. మరియు నీచక్రవాకనాయకుండు తనచెలితో గలియుటకు వెలువడియెనో లేక నాయాచనను సఫలంబు సేయుటకు నాప్రియునితో మద్వృత్తాంతంబు వచించుటకు వెళ్లెనో, యిట్లుగాకున్న నాసందేశ వచనంబున నాదరంబు వీడి తొల్లింటివలె లోకంబునఁ దిరుగుటకు వెడలెనో, యని నిశ్చయింపంజాలక విరహజన్యశోక సాయకంబుల విభిన్న మర్మ యగుచుఁ ద్రాచుపాములచేతఁ జండాక్షంబులగు హర్యక్షంబులచేతఁ బరజీవ నాపహరణ శీలంబులగు శార్దూలంబులఁ దారుణంబగు నరణ్యంబునఁ దనపతిని వెదకుటకున్ వెడలెను. దయారహితచేతస్కంబగు నియతిచే నీవిధం

బగు నోర్వాంజాలని వియోగ దుఃఖంబు భయాతిశయంబు వెడ
లింపుచున్న మబ్బుల సద్దులచే నొందింపఁబడినదగు న త్తరుణి
యచ్చటి పర్వతకందరంబులన్నియుఁ జెలికాని నెమకుచున్నవై
చిరకాలంబగుటచే మిగుల నలసి దుర్బలంబులగు నవయవం
బులు గలదగుచు నొక్క మఱ్ఱిమ్రానినీడ నాశ్రయించె.

మరియు న త్తరుణి వాడినమై మెఱుఁగుగలదగుటఁ బండి
నలతఁబోలుచున్న సుకుమారంబగు శరీరంబు గలదగుచు
వెచ్చని నిట్టూర్పులచే నసదుగాని జతనంబున దారినడుచుటం
బుట్టిన యలసటం బోఁగొట్టుకొని, తోఁడెంబుఁగంగూయుచున్న
పెక్కు తెఱంగులుగల పక్కులకిక్కయగునదియుం బొడవు
కొమ్మలచే దిక్కులదారి నడ్డంపుకొమ్మల దెసల నావరించుచు
న్నదియు దట్టంబులగు పత్రంబులకుఁ గొట్టంబయినదియునగు
నాచెట్టు తలకట్టుంగూర్చి చేతులు జోడించి యిట్టులనియె.
ఓమునియామినీశా! హఠంబను యోగంబు నభ్యసింపం జిర
కాలాసక్తుండవగు నీతపంబు మిగుల కష్టతరంబుకదా. అతి
నిబిడంబగుట మంచువాసి దొలఁగించు జెట్టివలనఁ బొడమిన
వేడిమి బోగొట్టునట్టియు బండల వెలఁదుకనంటి యున్నట్టియు
నీజడలకుప్పను బెక్కుపక్కులు నివసించి యున్నవి. ఉల్లం
బును, నట్గొడలును కదలనిదానిగఁజేసి డెందంబున నాకరబ్రహ్మ
మును జూచుచున్న మీవంటి మహాత్ములు ధ్యాన సామర్థ్యం
బున జరిగినదానియు జరుగుచున్నదానియు జరుగఁ గలదాని
యురీతిఁ గంటబడకున్నను కరతలగత [illegible]
నెఱుంగుచున్నారు. వెడదనిడుదల నలరు

తాపసపాకశాసనా! బాటసారుల వెతల నూతంబడఁద్రోయు నేలికా పాలింపుమని ప్రార్థింపుచున్న నాకు దయితుం డిప్పుడే మొనరించుచున్నాఁడో వచింపుము. వాడిగల నడుము చిక్కిన లేడిపిల్లను వదలించుటకై దయనొంది యాసింగముం దుది ముట్టింప ధనుర్బాణంబుల ధరియించి దాని ననుసరించి వెలు వడెనా? లేదా? యెట్టిగన్నెరుపూలం బురణించుకరంబులుగల నారమణుండు కరిశిరోంతరంబున నున్నముత్తియంబుం గోరి, యయ్యా దారిదప్పి యామతంగజ మార్గంబనుసరించి వెడ లెనా? నాజీవితేశుండు మధుర స్వరంబు గలదియు శ్రవణో త్సవదాయియు నిచ్చట బోఁడమెనని తెలియనట్లు బుట్టినట్టియు కోయిలకూత నాలించి యావనప్రియ యెచ్చట నున్నదో యని యాసక్తిచే వెదకుచున్నాఁడో వక్కాణసేయందగు. నావయ స్యుఁడు మబ్బులంగని నిబ్బరంబగు నుత్సాహంబున నెమ్మల తాండవంబను నాటసలుప డెందంబునకు విందుసేయ నాలా స్యంబుగనివానిచెంతవదలుటకు గచ్చరియైయుండెనా? మఱియు దానంతటం జూచుచు నొరులకుం గనపడకుండఁజేయు దిర స్కరిణియను విద్యచే నావృతుండై సరసియెదుటనుండి యీ నాయవస్థ నంతయుం గౌతుకంబున జూచుచున్నవాఁడా? మిగులసుందరుండగుట మదనమద నివారణ వారణుండగు నాప్రియతముండీ సరసిచెంతకు సలిలక్రీడనొనరింప నేతెంచిన యచ్చరమచ్చెకంటుల కూటువులచే సింగారంపుచేతలనెడు సత్కెలలచేత దిట్టంబుగం గట్టినం దనవనంబున గ్రీడింప గొంపోఁ బడెనా? చెప్పుమా? మఱియు నాచెలికాఁడు మురిసిన చెట్టులు

తావులు గలకానవేల్పులసానులచే మిగుల దవ్వుగొంపోయి రుచికరంబులగు పర్ణపత్రంబులచే బోషింపంబడుచు నాకైన కష్టంబుల మరిపింపంబడెనా? వచింపుము. ఓమునిచంద్రమా! యిట్లుగాకున్న కాననంబున నతిదారుణంబగు విరోధిచేతఁ బడలేదుగదా? మస్తుగొన్నచె గల మెగంబుచేత కరంబునఁ బట్టుకొనంబడి కొట్టి కూలింపఁబడలేదు కదా. లేకున్న నాలంబున నాదయితుండు క్రూరంబులగు శార్దూలాదులఁ గడగండ్ల నొందింపఁ బడలేదుకదా? మరియుఁ బలుహజ్జ మెకంబు తలబెగల్ప నుద్యమించు బొబ్బ మెకంబున కడ్డంబుసేర నుద్యమించి, దానితోఁ బోరాడి నిహతుండు కాఁడుకదా? సావధానంబుగ ధ్యానంబున నాలోచించి నిక్కంబుగ వచింపుము. ఇటువంటి యపశంకం జేయనేల? నాజీవితేశుండు విపత్తును వీడి పోయిగనున్నవాడు. దైవంబు ననుకూలంబయి యుండు. అది యేమన్న నోఁకు దయ్యము దట్టంబుగనుండుతీవియలకూటువు విడఁగొట్టునేగాని ఘనంబులగు ద్రుమాకుల నణంపఁడుగదా! ఆతరుణి ప్రియవియోగ జనిత దుఃఖావేశంబున నెద్దియుం దెలియనిదైయి యాచెట్టునొకానొక మునిగం దలంచి కడుగరుణపుట్టంచు వచనంబులఁ బ్రియతముని యుదంతం బడుగుచు నయ్యెదనున జీవనప్రదుచే నతినిబిడంబులగు నుదకధారలచే దడపఁబడుచు నతనింగూర్చి యిట్లని వాక్రుచ్చె. ఓయి మేఘుడా? యీవర్షించుటవలన చాలింపుము. నయనంబు పోయినిచ్చు శరీరము గల యోవారివాహా! చల్లని యుదకంబుల నతికర్కశంబగు నారమణుని యుల్లంబు దడుపుము. డెందంబున నెడ

ఘాటునుం బొడమిన వేడిమి మిగులు లేకుండ గాల్పంబడిన నాయుల్లంబునై తేదేవతలకుజావులేమినొసంగెడి యాయమృతం బైనం జల్లదనంబుజేయంజాలదు. జగంబునకెల్ల హితంబొడ గూర్ప నిచ్ఛగించిన మనంబు గలిగినట్టియు, నాయాసం బపహ రించునట్టియు తావువీడి పెరనాడు లందున్న వారికెల్లతమ యుల్లాండ్రయందు దమినిబుట్టించి వారింగలియమిక్కిలి వేడుకం బొడమించునట్టియు నీకు విరహసంజనిత బాధావార్ధి మునిం గిన మా బోటరుల నుద్ధరింప దూతకృత్యంబుచితంబని యే నెంచెద పరులకుపకారం బొనర్చుటయందు మిగుల నీమహి మంబు విదితంబే. ఓయి సరసుఁడా! నీయుదకములచేత నిజ్జ గంబంతయు బాలింపఁబడుచున్నది. ఆకసమందు నీకెయ్యెడల సంచారం బవికలంబై తఱచుగం బొలుచు. ఓయిసుందరుఁడా! తరి గల్గినప్పుడు పర్వతంబుల యున్నతంబులగు పర్వతంబుల సానువులం దుండక వర్షించెదవు. నితాంతంబున్నతంబగు పదంబు విడిచి సారెసారెకు నడుగు నున్నతటినుల తటం బాశ్రయించుచున్నావు ఇద్దియుం దగినదియే. బరులకు హితం బొనరించుటకై యలసట సహించు సజ్జనులగువారొకానొకప్పు డైన లాఘవంబు నొందరుగదా! చలినట్టుల విసరుటలం గంపి తంబులగు నంతరంబులు గలవౌట మ్రోయుచున్నవి గావున నాపద నొందినవింబోలె నేడ్చుచున్నట్టు లున్నట్టియు నొకదా నివలన నొకదానికిం గలిగిన రాయిడిచే బొడమిన యనలుని దాహంబునం బీడింపంబడిన యలవెదుళ్ల కడగండ్లనెల్ల నవిరత ధారాప్రసారంబుల శమియింపఁ జేయుచున్నావు. ఓయి చంద్ర

డా! జీవితనేతచేత వంచితయగు నాయందు నీఘృష్టుల నెల కొల్పకు మని నేజేసిన వేడికొంట నంటించుకొనక మింటనంతటం దనదీప్తిచే నంటికొన్న యాచుక్కలదొరను వేకువతఱియల సింహికానందనునివలె రూపుమాపె. అత్యంతాపన్నయగు నన్ను సరకుసేయక వెలువడిన చక్రవాకమును, ప్రియావిరహ జనితంబగు శోకంబు పరితపింపఁజేయుచున్నది. ఓజీవనదాన పరాయణా! నీవు పరుల కుపకారంబు సలుప నన్నివిధంబుల నుద్యోగించు వాఁడవు. కాన నీకార్యం బొడగూర్పుమని యెంత లో వరాకి యని చెప్పఁదలఁచియున్నదో యంతలోన నొకసమీ రణంబు విసరి దాని బింజబింజలుగాఁజేసి మిగుల దవ్వుగ వెలువ రించె. సర్వజనుండును తటస్థునివలె దనదగు కర్జంబుల నెఱ వేర్చికొనుటకు జతనంబు సలుపువాఁడుగాని యొక్కండైన నాయాచన నంగీకరించు వాఁడులేఁడు. ఎంతకష్టం బేతెంచె. ఇందఱను వేడిన నొక్కండైన నామనవి యాలించి యూరడింప కునికి యొక యవశకునంబైయుండె అందువలన నాజీవితే శుఁడు గొప్పయంగద నొందినవాఁడే కావలయు. నయనబా ష్పంబు లుప్పతిల్ల నిట్లువచియించిదయితుని శుభవార్తవినుట విషయమై విఫలంబగు ప్రయత్నంబుగలదై తన దౌర్భా గ్యంబు మిగుల దూరి యత్తరుణి దనతనువాశ్రయాశు న కాహుతిగం జేయ నిశ్చయించె.

ఇట్లు పలుతెఱంగులఁబలికినసద్ది పక్కి గావునఁ దనజాడ జూడకయున్న దానింగని మరియు నిట్లనినినిచె ఓరథాంగమా! నీవు నేమంబున నున్నంగాని యెంతబలవంతుడైనను నతి

శూరుండైనను పగఱ మార్కొను నయ్యెడ నాలంబున నే
మియుఁ జేయంజాలండు. అట్టి మహారథు లేని సహాయంబు గోర
నీమహిమం బభివర్ణింప జెలి కానిచే దోసంబునొందిన నేనెంత
దాన? కావున నాయెడం గనికరించి నాపలుకులుచి తంబుగ
నాయొడయని చెవులకింపుగ వాక్రువ్వుము. మరియు నాయా
ననంబుగని నీకు వినోదకారియగు నలినంబులకు నొంటమి
కాఁడని తలంపందగదు. ఇంతియ కాదు. నాయక్షుల వీక్షించియు
జలజంబు కలిమి బలంబునం గొనఁజాలు నక్కతంబునం బగ
ఱయయని తలంపందగదు. ఆతమ్ములకు నెయ్యంబునం దమ్మ
నియ యాలోచింప నుచితంబగు బుజంబులును దూడుల
కైనయగుట చెలికారంబుచేతనే యని యెఱుంగ వలయు
నక్కతంబున నన్ని తెఱంగుల నీకు సంతసంబుసేయ నత్తమ్ముల
నెమ్మికి నిమ్మ లనియ పరికించి యించుక దలంచి కరుణించి
నాపని బూనందగు. ఇట్లు వినిచినఁ బులు గగుకతంబున నాలిం
పక మరుమాటలేకయున్న నంతరంగంబున నించుక గనలియు
మనస్వినియగుట దాను దూరక మనంబున నిట్లని తలంచె.
ఆహా! పీని డెందం బెంత గట్టిది. ఎంత బ్రతిమాలిన నిది
నాయంగద యాలింపనిదానింబోలి యున్నది. జడాశయాను
చరంబులగు వానికి స్వోదయసమయంబునం దనాసక్తి సహ
జంబ కళానిధివిముఖంబులగు వానికి. బరోపకార తత్పరత
యెట్లు కలుగు? ఇంతియ కాదు. వారు దమకు కలిని గలుగు
నపుడు పరుల్లనాదరింపమి తమకు గొప్పతనం బొడగూర్చునని
తమ సుఖంబుల నాలోచింతురుగాని పరులదైన్యంబు పరికిం

పరు. అందుకే కాబోలు. సీతాకాముకుఁడగు దాశరథిచే క్షణవ యగుక్షణదయందు పొగులుట గలుగునని శాపితంబులయ్యె. అని యసదుత్తరిని బరికించి యయ్యోది దూరందగదు. గతదినం బునం దమ్మి చెలికాఁడు గ్రుంకునది మొదలుగ నీరేతి రంత విరహవేదన వేఁగి తమకాప్తుండగు వేడివెలుంగే తేర మదనక దనమనంబునం బొలుచుచున్నది. కావున దీని నిందింపం దగదు. "సుజనోఽపి కుప్యతి పర మనవసరజ్ఞేన యాచిత స్సహ్యా దా" యనునయంబు దెలిసియుండియు దూరితి నేని జగంబు నగుం గదా? కావున దీనివీడి పరుని వేఁడెదనని యొక్కకోయిలం గని, ఓకోకిలమా? నీవు కలిముల చెలికొమరునికి కాముకులకుం గూటమి కల్పింప నెదురులేని సరదారుంగా నెలుంగుదు. కావున నీకుం బ్రిణమిల్లి యొక్కమనవి నర్పించెద నక్కటికం దాల్చి యాలింపు మని వేఁడుకొనుచున్నది.

అయ్యెడ నయ్యది సాజంబుగఁ గూయుచున్నది. అత్తరి నాతరుణీ మణి దాని రుతంబునకుం బెదరి చండ్రనిప్పులకు నొప్పువిచ్చుకన్నులంగని కని కోపించిన దానిగనెంచి మనం బున నిట్లు చింతించె. ఔరా దీనిపొగరు! శ్రవణ విదారణ క్షమంబుగం గూయుచు గన్నుల నల్లబొట్టులవలె నెఱ్ఱతనం బున మిగులువానిం జేసి యలుకం గాంచుచున్నది. అమ్మ పెంపు నయ్య యానతింగానక పరభృతంబులగు వానికి దీనజనవై ముఖ్యంబు చితంబ. ఇద్దియొక్కటియే కాదు. దీని సజాతీయంబు లెల్ల ననవద్యంబులై దీనదశం బొరలిన పశువుల వ్రణంబుల భేదించి వానిపొలసు దినుకాకులమూకలచే బెంపబడినవికదా!

కావున దీని దైన్యంబున వేడుకొనుట నాదగు తెలివి లోపంబు గాని దానిదోసంబు గాదు. ప్రకృతి వాలినునకుంగనికరంబు వాలికిగదా! కావున సౌమ్యాకారుండరు యాచింపందగిన వాఁడని యిట్టట్టు పరికించి యొక్కకీరంబుంగని దీనిచేఁదనదగు గ్రచ్చుమెచ్చుబడునని తలంచి దాని కిట్లని వాక్రుచ్చె—ఓకీర వరమా! నీవును మాబోటరులగు తరుణులకు లౌకికంబులగు నీశాతశాతంబు లోడగూర్చు మదన మహారాజునకుం బ్రధాన వాహనంబవు. చూచెడివారలకు వదనంబున ననురాగంబు ప్రకటించు చున్నవాఁడవు. మధుర వచనంబుల నెల్లయెడం బలుకువాఁడవు. సౌమ్యరూపుండవు. కరకసహకార శర్కరా ప్రముఖ శుచిపదార్థ భోజనుండవు. మధురస్వభావుండవు. అక్కతంబున నే రమాకుమారుండగు కుసుమ ప్రదరునిచే వాహనోత్తమంబ వగుట నేకరింపబడితివి. ఇద్దియంతయు నిక్కంబుగాని కార్యవశంబున నే బొగడుట కాదు. నీవు తలంచిన నెద్దియు మాబోటరులకనుపగమ్యంబగు నరతంబొక్కటియు గానంబడదు. కావున నిన్నొక్కటి వేఁడెదనని తన యాశయంబుం బ్రకటించిన నదివిననిదానివలె యూరకున్నం దనయుల్లంబున నిట్లని చింతించె. లోకంబుననెదిరి యాశయం బెఱుంగక రూపసౌమ్యభాషల సంతసించి తనతమియీ దేరునని తలంచువాఁడు తెలివిమాలినవాఁడు. వీనికిం బుద్ధిసుద్ధిలేదు. ఇదియు 'సద్యోబుద్ధిహారంబింబ' మను వచనంబుచేఁ దెలియం బడె. ఇద్ది తలచుగ దొండపండుల మెక్కెడుగదా! కొందలు గడుసులు ముఖవిలాసంబుచే రాగంబు విలసిల్లఁ

జేయుచు మృదుభాషణంబుల నాశ్రితులమనంబులు సంత
సిల్లఁజేయుచు తామందఱ కుపకారకులవలె గానుపించుచు
నకదర్యమర్యాదావంతులందొలు దొరనుకొలుచు వితంబున
దమ్ము సేవింపవలయునని మనంబున నెంతురుగాని, వారికి నిసు
మంతైన నుపకారంబు సేయ నోఁపరు. అట్టివారిని సేవించుట
కంటె నూరకుండుటయ యుత్తమంబు అని వితర్కించుచు
మింటనంతట నంటుకొని కంటబడు కృపీటవాహుంగని, యీ
పక్షులా నామనోరథంబు నెరవేర్చు? ఇవి కార్యకరంబులని
నమ్ముట కృపీటంబుల మూటఁగట్టుట గాదె? మునిసిచెట్టుం
దేనెలో దడుపుట గాదె? మరియు నవకేశికి దోహదంబు సల్పు
టగాదె? కాన నివి కార్యప్రత్యాయకంబులని యెన్నఁదగదు.
పురోవర్తియగు నితండు జీవనప్రదుండు దూరదేశగతులైన
వారిని తన స్తనిత భాషితంబుల బోధించి చెలికత్తెలతో
హత్తింపఁజేయువాఁడు. మరియు నీలకంఠ లాస్యకళా సంపా
దన చతురుండుగావున నీతండు వేఁడఁదగినవాఁడు అనితలంచి
మించిన యుత్సాహంబున వానికి ట్లనియె. ఓయీ! ఘనా!
యీయభిధానం బెల్లవారికిని సంజ్వర హారణంబు చేయుట
నీక తగియున్నది. నీవెప్పుడును బలమును విడువనివాఁడవగుట
బలాహకుండవు. లోకంబునకుం బ్రాణాధారంబగు నన్నంబు
నకు మూలకారణంబగుసస్యంబు పోషించు వారలకు సంతోష
విధాతవగుట మ[illegible]రుంకవనియుఁ బండితులచేత [illegible]క్రుష్వం
బడుచున్నావు చం[illegible] కిరణ కిరణమండల పీడితంబుల[illegible] చాత
కంబులను నమృత ప్రదానంబున జీవింప జేయు[illegible]న్నావు. పర

స్వర సంఘర్షణ సంజనిత జ్వాలనవిధూతంబులగు వంశంబులకు నెల్ల జీవితప్రదాతవు. దివ్యజ్ఞానంబువలె నమృత ప్రదుండవు. గంగాప్రవాహంబు వడువున సంగతశతహ్రదుండవు. మార్కండేయాది తాపసవరులకరణి నిజసేవన సంతోషిత నీలకంఠుండవు. చపలాశ్రితుండవయ్యు ఘనుండవు. గోత్ర భిదాహ్వానుండవయ్యు గోత్రానందవిధాతవు. కావున నీ మహిమ పొగడ నేనెంతదానను? సరసులగువారు పరులకు హితంబునేయ గోరువారుగదా? సకలభువ నానంద సంధాన నిపుణుండవగు నీకు నేనేమి యుపకారంబు నేయంగల దానను. అదియుఁగాక ఘనతకలవారు ప్రత్యుపకారం బపేక్షించి సహకారంబు సేయనొల్లరు. అందులకుఁ దార్కాణంబవీవ. నీ వేయుపకృతిగోరి కడలింజేరి నీరంబులనాని వాని మధురం బుల నొనరించి వానిచే సర్వజంతువులకు సంతసం బొనరించు చున్నావు? వినుచుమా? కావున నాకర్జం బూర్జితంబు నేయు మని స్వాశయంబవిశయంబుగ నేయవలయునని వేడుకొన నతండును రథాంగాదులవలె నూరకుండె. అంతట నాతరుణి సారెసారెకును నతితీవ్రంబులగు నిశ్వాసంబుల గోకనదదళ భంబగు తన మోవికి నీలోత్పల పత్ర ప్రభలు నిగుడించుచు, హాదైవమా ? నాభాగ్యం బెట్లయ్యె. ఆర్యాదులటుండనిమ్ము జీవనప్రదుండని జగదుదయంబు మొదలుకొని విదితుండగు నీ ఘనుండును నాయెడల గరుణా విహీనుండై యూరకుండె. ఇందుకే కాబోలు నంతర్వాణులు అరిర్మిత్రం విషం పథ్యమ! ధర్మోధర్మ తాంవ్రజేత్, అనుకూలే జగన్నాథే విపరీతేవి

పర్యయః-యని వాక్రుచ్చుచున్నారు. నా చెలికాని కివ్వార్తనంప జతనం బొనరించి యెందఱ వేఁడుకొన్న నందఱు నూరకుండిరి గాని, యెక్కండైన నా వేడికొంట మనంబునంగిలించి యాలించి యాలకించి నించుకంతయైనం గనికరంబున నంచితుండై యను మోదించిన వాఁడు లేఁడు సరేకదా ? మాఱుమాటనైన నుడి విన వాఁడు లేఁడు. వీరందఱు కనికరంబు లేని వారేనా ? కారు. కాన మత్ప్రియుం డెక్కటతనంబుననో యపగత జీవుండు గావలయు. వేడబడినవారంద ఱూరకుంటయే గొప్ప యవశకు నంబు. కానిమ్మా శరీరంబు క్షణభంగురంబు. దివ్యదేహంబైన స్థిరంబు. కావున నీతనువు వీడి నాకంబున నాకాంతునితోడం గూడి స్థిరభోగంబు లనుభవించెద. సహగమనంబు నేసిన నెలఁత పాపాత్మురాలైనను జలసంక్షాళనంబున పంకజంబుం బోలి తన పాపంబులు భర్తపాపంబులతోడ నదృశ్యంబులుగా నింద్ర భవనంబున నమానంబులగు భోగంబు లనుభవించునని శ్రుతు లెల్ల గర్జింపుచున్నవి. అక్కటంబుననే నీకాయంబనల నికా మం బొనరించి త్రిదివంబున నిశ్చింతనై యుండెదనని సమకట్టి యధనంబులగు నింధనంబుల నతికష్టంబున నేరితెచ్చి యుచితం బుగఁ గూర్చి యందు దారుమధన సంజాతంబగు జాతవేదను నునిచి ప్రజ్వలింపం జేసి యచ్చటనున్న యొక్క సరస్సున యథావిధిగ మజ్జనంబుసల్పి భగవంతుండగు మార్తాండుని కెదురుగ దృష్టిని నిలిపి చేతులం జోడించి యిట్లని వచించె—

ఓదేవా ! నీవు సర్వజ్ఞుండవు. కర్మసాక్షివి. లోకంబున నీకుం దెలియని యరతం బొక్కటియు లేదు. అయిన నామనోగతం

బైన వ ర్తనంబు విన్నవించెద. రమణుండు నాపిపాస నడఁగింప నీరు దెచ్చెదనని చని యింతవరకును రాలేదు. అతని వార్తం దెలియుటకై యెంతమందిని వేఁడినను దత్ప్రత్యాయకోపా యంబు గానంబడదయ్యె. బలాత్కారంబున నాత్మహింస చేయఁగూడ దనియెడిది, భర్తృను గమనంబు చేసిన వనిత నతనితోడ నీమండల మార్గంబున వెడలి యొడలి చూపోడ యని లోకంబునం దిరంబులగు సుఖంబులం జాలి యుండునని యెడు వచనంబున, విశేషంబున సామాన్యంబుం బోలెని రసిం పంబడునను నయంబున సందియంబువీడి నేనీయొకలు విడిచెద. పరలోక సంగతి యటుండనిమ్ము. అట్టి వాని వీడి మనుట వీరిడితనంబుగదా ? అట్టివాఁడన నెట్టివాఁడని యందువా ? విను మితరులతోఁ జెప్పందగనిదియయ్యు సంశయంబు వదలి వచిం చెద. జీవితంబు వీడ నిచ్చగించిన దానికి వ్రీడతోడం బనియేమి? అతండొక్కయెడం గూటువతమి మిన్నుముట్ట గేళీగృహం బున శయ్యాతలంబునకుఁ జేరఁబిలిచి తనయిచ్చ మెచ్చుగ నుచ్చరింప, మణిహారంబు మరిచితి. దానిం బూని వచ్చెదనన నిది నాయొద్దనేయుండె. నది నీకుత్తుక నుంచెదనని యచ్చట గోరుల నంకంబు లొనరించి, యిది మణిమాల గాదాయనియె. మరియొకప్పుడు మాటలవరుసను చందమామ తమ్ములకుం బగతుండను పలుకురా నద్ది యుద్దిలేని యనృతంబనియె. నేనిది లోకవ్యవహృతి విరుద్ధంబుగాదా యనఁ జూడుము. అది యట్లుగాని సంగతి నీకు నిక్కంబని తోఁచునట్లొనరించెదనని బలంబున నాపయ్యెద జారందిగిచి కుచంబుల నఖరాంకంబుల

నించి యివ్వి తామరమొగ్గలుగావా? యివి లేఁతనెలలు గావా? వీనితో సంయుక్తంబులై తొల్లింటికంటె గాంతి మీరి యున్నవా లేవా? నీవ వక్కాణింపుమనియె. మఱియు నొక యెడ నీయుద్ధబాసం గూర్చిన ముత్తియంబు దారం బగు తారననుకరించు చున్నదని నేనుడువ, సరే యిట్లి నకుము. నీదగు మోము పున్నమచందురుఁడుగదా? యీనా సామణి తాదృశంబగు తారయే. ఉభయ సంయోగంబు గలుగ సంతానానుదయం బబ్బురంబు. దాని మార్చెదనని చెక్కుల గోళ్లనొక్కి యివియు లేఁతనెల లనియె. ఇంతమాత్రంబేనా? యిట్టివి పెక్కులుంగలవు. లంగనములలో మనుగుడుపులను వాకున వానినన్నియు వచించిచాలును. అట్టివాని వినియో గంబునొంది మేఁకుబూనుటకంటె నుసురుల నసురుల కొప్పగిం చుట తలకట్టుగాదా? కావున నోలోకబాంధవా? నన్ను పాపంబుల విడదీసి ప్రియసంగతం గావింపుమని పలుమారులు వేడుకొని, యాయగ్నికి ముమ్మారు పరిక్రమణం బొనరించి, యందుదుముకబోనంత నవ్విభాకర పేరితుండై యొకదివ్య పురుషుండు, వీడుమీ సాహసంబని పలుమా రురుముంబోలు తార త్వంబున పిలుస్సిల్లు పలుకులంబలుకుచు, బుజంబులసాచి మరలించుచు నెదుటగానంబడి యిట్లని మొగంబున హాసనంబు మొలకలెత్త వచియించె. నీవేడుకొంటకుం బ్రసన్నుండగు మార్తాండుండు గడుసంతసిల్లి నీయగ్గింజొరుట మరలించు టకై నన్నంపె నీచెలికాడు సేమంబుననున్నవాఁడు. అలఁతియ దనున నీచెంతకేతెంచగలఁడు. నీవు పెక్కుతరి యల్లోకంబున

నీవేడుక కానిం గూడి యభిమతంబులగు సుఖంబు లనుభవింపఁ గలవు. ఈజతనంబువీడుమని యాడి యాపెనోదార్చి వఃరలి వెడలె. అంతట నాపె తదీయ వాక్సుధానుభవ మహిమంబున నపగతకాయ కార్శ్యయై ప్రియావలోక నానందంబు ననుభవింప నతివ్యగ్రమానసయగుచు నచటనుండె. అంతట నాతరుణుండు తనకుం గల్గిన విపదకు వగవక విపినంబునం దగచేబడలియున్న యర్మిలి పూఁబోడివీడి నీరంబు దెత్తునని వెడలితిని. ఎక్కడెక్కడ దిరిగినను దానిజాడ పొడగానన్తైతిని. అది యప్పటి దూపనేమయ్యెనో? యచ్చట దిరుగుచున్న సింగంబులం దోడేళ్లచేతం దక్కిన కటిక మెకంబులనేమయ్యెనో? దీని నడుముంచేతం బరాజితంబులగుట సింగంబులును, దీనియానంబునకోటువడిన వగుట మస్తు గారులును, దీనిచూపులచే రూపుమాసి నవానింబోలియున్న జింకలును, దీనిఁపలుకులచే నలుకనొందిన కోయల మొదలుగల పులుగులునుఁ జలంబుననేమి కీడు నొడమించెనో? నేను కరువలి కోలాబండితుండనగుట తెలిసి యామొయులు తొలుతదీని వేసలిచేత నోడింపంబడుట నేనెడగలిగి యుండుటం దెలిసి యగ్గిపిడుగులదాని యొడలున నొడగూర్చి యేమిచేసియుండునో? యిదిమొదటగలదురూహాల లోలంబగు నుల్లంబున పల్లవించు చింతలుగలవాఁడగుచు. నంతట నక్కాన బరికించువాఁడగుచు సంచరించుచు నెక్కడం దానిజాడఁ బొడగానలేక నితాంతతాంత చేతనుండగుచు చేతంబున నిట్లని విలపించె. ఆహా! గత జన్మంబులయందు మనమెట్టి కిల్బిషంబొనరించి

యుంటివో! అందువలననే మనకిట్టి వియోగదుఃఖం బుప్పతిల్లె. దప్పిచే నలసి యున్న నీకు పానీయంబు దెత్తునని నాపొడ నలుదిక్కుల నవలోకించుచు శ్వాపదంబులు నేరి బలిమింబట్టుకొనిన నాపొడఁ జూడఁజాలక యేమని తలచితివో అవ్వి బాధింప నేమనుకొంటివో, అవ్విబాధించుతఱిం గిజగిజ కొట్టికొనుచు నాయుదంతం బేమని మనంబున నాటించితివో కజ్జలమలినంబులగు నీనయనంబుల జొంబించు నెడల మలీమసంబని శంకింపక నామోవినానితివిగదా? అమృతపిండం బులకు గండంబులం జేయు నీగండంబుల నామొగంబుగని మణిమయ ముకురంబులం జూడ నొల్లకుంటిని. ఇట్టివాని నెన్నింటికి జింతనొందుదు ఎంతమట్టుకు వగబొగిలినఁ దొలి పుట్టువునందు జేసిన చేతలం జవిజూడక తప్పదు. అనుచుం జనుచు మింటినంటిన మంటల తిట్టల దంటతనంబుమాపు దానిముందర నలరు నగ్గినిగని తనిసిన డెందంబున నాచెలి మబ్బువాజి తావున సుమాళంబుగనుండె. ఉసురుల విడుచుతఱి నెవ్వని కెయ్యెది నెయ్యది యుల్లంబునం బ్రభవిల్లు నయ్యెదత నికి మారుపుట్టువున సంభవిల్లునని యార్యులు వచించుచున్నారు గదా? నేనియ్యనలంబునంబడి ప్రాణంబుల వీడి దాని తోడం గలసెదనని యెంచి, మించిన దిట్టతనంబుతో నోయగ్ని భట్టారకా! అన్ని కర్మంబులయందును భావనగదా ప్రధానంబు. నీవు హావిర్భుజుండవు. నేనీ శ్రేయస్సాహావ్యంబుగ భావించి నీకొసంగెద. నీవనుభవించి తృప్తుండవై మరుపుట్టువున దానిచెట్టబట్టునట్లు దయచేయుము. ఇదియ నాయభిమ

తంబు. అని ముమ్మారు ప్రదక్షిణం బొనరించి, యందు నురక నుద్యోగింప, నంతకుమున్నె భానుప్రేరితపురుష నిరాకృతవీతిహోత్రిప్రవేశ యగుచుండఁ దదనుగ్రహంబునకు నచ్చెరువడుచు నతనిం బ్రార్థించుచు నాచితకుం బ్రాంతంబుననున్న యొక్కచెట్టునీడనున్న యత్తరుణి యతని నుడువుల సవ్వడిం బట్టి చివాలునలేచి యతిప్రియత్నంబున వేళంబునం జని యనలంబునం బడకుండ బిరుందన నేగి కుచకూట నిష్పృష్ట తదీయపృష్ఠయగుచు వితత బాహావల్లుల నతనిం గట్టిగఁబట్టుకొనియె. పదంపడి యత్తరుణుండు స్పర్శ విశేషంబున దానిం బ్రియురాలిఁగ నెఱింగి తిరిగి చూచినం దదవసరోదితయావత్స్వంజ్వరభావం బడంగ నాతని రదనచ్ఛదంబు పీడించె. అంత నయ్యిరువు రాశ్చర్యానందాక్రాంత స్వాంతులగుచుం గొంత దడవు నిబిడోపగూహన సంజనిత శాతంబున మై మరచి కొం తడవునకుం దెలిసి తదవసరోచితంబులగు నుదితంబుల సంవిదిత పరస్పరోదంతులై యంతంతటం దిరుగుచు నాశకటంబు గని దాని నారోహించి యిష్టంబులగు గోష్ఠుల సల్పుచుం బుటభేదనంబు సేరి మందిరంబునకుంజని ప్రతిపదంబునం గందళితానందులగుచు నిష్టంబులగు భోగంబులనుభవించుచుండిరి.

గద్య.

ఇది శ్రీ కోరాడ రామచంద్ర రచితంబగు వచనకావ్యంబు [illegible]త నామధేయంబు

శ్రీ శ్రీ శ్రీ